# మన రామకృష్ణుడు

రచయిత్రి

**శ్రీ శ్రీ మాతాజీ త్యాగీశానందపురి**




ప్రకాశకులు

**శ్రీ అనుభవానంద గ్రంథమాల**

బాపట్ల (గుంటూరు జిల్లా)

భీమునిపట్టణము (విశాఖ జిల్లా)

పదియవ కుసుమము



శ్రీ శారదా శతవార్షిక జయంతి ప్రచురణము
ప్రథమ ముద్రణము మార్చి, 1954.
ద్వితీయ ముద్రణము ఆగస్టు, 1960.

మూల్యము : ఒక రూపాయి

రు. 1-00

కళ్యాణీ ప్రెస్,
తెనాలి

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

**ఉద్దేశ్యము :—** ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానంద స్వాములవారిచేతను యితరులచేతను రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

**విధానము :—** సంవత్సరమునకు మొత్తమునకు రెండువందల పుటలుగల గ్రంథములు వెలువడుచుండును.

**విరాళము :—** 1) రు 500/- మించు విరాళి మొసంగువారు మహారాజ పోషకులు. ఒక ముఖ్య గ్రంథమున వీరి ఫొటో ప్రకటింప బడును. వీరి నామములు ప్రతికుసుమమున ముద్రింపబడుచుండును. గ్రంథ మాల ప్రచురణములన్నియును నుచితముగ వీరి కొసంగబడును.

2) రు 100/- మించు విరాళి మొసంగువారు రాజపోషకులు. ప్రతి గ్రంథమున వీరి నామములు ముద్రింపబడుచుండును. మరియు గ్రంథమాల ప్రచురణము లన్నియు వీరుకూడ నుచితముగ బడయుదురు.

3) రు 50/- మించు విరాళి మొసంగువారు పోషకులు. వీరి నామ ములు అన్ని ప్రచురణముల ప్రకటింపబడును. ప్రచురణముల వీరు సగము ధరలకు బడయుదురు.

4) రు 25/- మించు విరాళి మొసంగువారు మిత్రులు. ప్రచురణముల 3/4 ధరలకు బొందుదురు.

5) రు 10/- మించు విరాళి మొసంగువారు సభ్యులు. ప్రచురణముల వీరు 1/8 తగ్గింపు ధరలకు బొందుదురు.

గ్రంథమాలయొక్క మహోద్యమమునకు ఎల్లరు ఉచితరీతి తోడ్పడుదురుగాక.

# ఏరాశీకర్తలు

## మహారాజపోషకులు

## రు. 516/-

1 శ్రీ బలభద్రుని చెన్నయ్యశెట్టిగారు & సన్స్, కమీషన్
మర్చంట్సు, ఆయిల్ మిల్సు, భీమునిపట్టణము.
2 శ్రీ పులవర్తి సుబ్రహ్మణ్యం శెట్టిగారు & సన్, శ్రీవెంకటేశ్వర
ఆయిల్ మిల్సు, భీమునిపట్టణము.
3 శ్రీ నందగిరి వేంకట రామదాసు పంతులుగారు & సన్స్,
శిర్లపాలెము, భీమునిపట్టణము.

## రాజపోషకులు

## రు. 100/-

1 శ్రీ మొంటా ఈశ్వరయ్యగారు, కమీషన్ మర్చంట్సు,
నెల్లూరు. రు 300
2 పసుమర్తి శేషాచలం శెట్టిగారు, క్లాత్ మర్చంట్సు.
3 నూనె శేషాచలంశెట్టిగారు, రైసుమిల్సు, &
కమీషన్ మర్చంట్సు.
4 నూనె జగ్గయ్యశెట్టిగారు, రైసుమిల్సు, &
కమీషన్ మర్చంట్సు.
5 చిత్తూరు మునస్వామి మొదలియార్ గారు,
కమీషన్ మర్చంట్సు. రు 116
6 యర్లపల్లి గోవిందు శెట్టిగారు, బరన్ & ఫ్రట్రైసర్సు. రు 116
7 గాలి నారాయణరావు గారు M. A., L. T.,
రిటైర్డు ప్రిన్సిపాల్, కర్నూలు ఉస్మానియా కాలేజి.
8 కొత్తూరి రామయ్య, కర్పూరపు రామకృష్ణమూర్తి
కంపెని, టుబాకో మర్చంట్సు. గుంటూరు.
9 పోలిశెట్టి సోమసుందరంగారు, టుబాకో మర్చంట్సు.

కర్పూరపు వెంకట నారాయణగారు, టుబాకో మర్చంట్సు.
వంకాయల కోటేశ్వరుడుగారు, టుబాకో మర్చంట్సు.
కర్పూరపు కనకవల్లి తాయారమ్మ గారు.
ద్విభాష్యం అన్నపూర్ణయ్యగారు.
బొలిసెట్టి సీతారామయ్యగారు, అడ్వోకేటు, బాపట్ల. రు 232
బూసరాజు వేం. నరసింహారావుగారు, వైద్యులు, స్వర్ణ.
బొడ్డుపల్లి సీతారామస్వామి శాస్త్రిగారు, కర్లపాలెం.
మంతెన వేంకట రామరాజుగారు B. A., బుద్దాం. రు 116
పుగిపాక సూర్యప్రకాశరావుగారు, కరణం, అమృతలూరు.
వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, బచ్చుపేట, బందరు. రు 116
వల్లూరి వేంకట సూర్యనారాయణగారు, వకీలు.
యద్దనపూడి రామచంద్రరావుగారు.
తాడంకి వేంకటకృష్ణారావుగారు, అడ్వోకేటు.
మోటమర్రి దయానిధిగారు.
తాడికొండ నాగేంద్రరావు గుప్తగారు, మెడికల్ షాపు.
చిత్రపు అచ్యుతరామయ్యగారు.
దీవిసేతు మాధవాచార్యులుగారు.
అద్దేపల్లి వేంకటరామయ్యగారు.
పిన్నమనేని లింగయ్య చౌదరిగారు, అడ్వోకేటు. రు. 116
జగర్లపూడి వేంకటేశ్వర్లుగారు. విజయవాడ.
బొమ్మదేవర హేమలతా దేవి బహద్దర్ వారు. ఏలూరు.
చావలి సీతారామయ్యగారు, అగ్రికల్చురల్ ఇంజనీయరు.
బండి వీరరాఘవమ్మగారు, చింతలపూడి.
బండి రామారావుగారు.
మంచిరాజు చిన వేంకటరత్నంగారు, భీమడోలు.
మాపులేటి సోమరాజుగారు, గుండుకొలను.
దుర్గంపూడి ధర్మరాజుగారు.
భీమవరము వర్తకసంఘభవన గ్రంథాలయము, భీమవరము.
ఇమ్మిడి సత్యనారాయణగారు, కమీషన్ మర్చంట్సు, పాలకొల్లు.

39 శ్రీ బొండాడ వేంకటరాజు గుప్తగారు, క్లాత్ మర్చంట్సు.
40 గాజులపాటి వేంకటేశ్వర్లుగారు.
41 అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు, M. L. A.,
42 కళా వేంకట సూర్యసత్య శంభుప్రసాద్ గారు.
43 బుర్రెడ్డి తమ్మేశ్వరరావుగారు, పోస్టు మాస్టరు.
44 దశిక రామారావుగారు, B. D., ఎక్స్టెన్షన్ సూపర్వైజర్,
కొవ్వూరు.
45 నిట్టల భీమశంకరంగారు, రిటైర్డు ఇన్కంటాక్సు ఆఫీసరు,
రాజమండ్రి.
46 చిన్ని తమణయ్యగారు, B. E., (మెకానికల్)
ఇంజనీరింగు కాలేజి, కాకినాడ.
47 కాళ్ళకూరి సూర్యనారాయణగారు, అగ్గిపురము విశాఖపట్టణము.
48 కురుకూరి సన్యాసిశెట్టిగారు, జనరల్ మర్చంట్సు.
49 బెండపూడి పేరరాజుగారు, M. B. B. S.,
50 పలుకూరి జగన్నాథరావు గారు.
51 దేవులపల్లి కృష్ణమూర్తిగారు బి. ఇ (ఎలక్ట్రికల్)
ఆంధ్రాయూనివర్సిటీ.
52 ఉద్దగిరి శ్రీరామమూర్తిగారు, కమీషన్ మర్చంట్, అనకాపల్లి.
53 కలిగొట్ల సూర్యనారాయణగారు, ము॥ చైర్మన్, భీమునిపట్టణము.
54 దుర్గా దానయ్యశెట్టిగారు, & సన్, మర్చంట్సు.
55 ఏడిద సూర్యనారాయణమూర్తిగారు.
56 రాయపురెడ్డి అప్పారావు నాయుడుగారు, వైస్ చైర్మన్.
57 పొట్టా వీరరాజుగారు. రు 116
58 నుదురుపాటి వీరరాజుగారు, శిర్లపాలెం.
59 శారదా గ్రంథాలయము. రు 116
60 పోలిశెట్టి వెంకటరమణయ్యగారు, (రాజా)
కమీషన్ మర్చంట్సు, విజయనగరము. రు 116
61 మాటూరి లింగమూర్తిగారు, క్లాత్ మర్చంట్సు.
62 పేమ్మాద్రి మహాలక్ష్మమ్మగారు, గణపతినగరము. రు 116

63 శ్రీ ఆడక్కి వెం. కృ. హనుమంతరావుగారు, శ్రీకాళహస్తి.
64 పూసపాటి రామచంద్రరాజుగారు, B. E., ఎక్జిక్యూటివ్ ఇంజనీయరు.
65 కొత్తా రమణాజీరావుగారు, కమీషన్ మర్చంట్సు, బొబ్బిలి.
66 నంగునూరు మహబూబురెడ్డిగారు, దేశిముఖ్, వరంగల్లు.
67 గైనేడి వెంకట అప్పారావుగారు, L. M. P., హైదరాబాదు.
68 వీరమనేని గోపాలరావుగారు, డిప్యూటీ డైరెక్టరు సివిలుసప్లయిస్.
69 వి. యస్. వారణాసిగారు, ప్రైవేటు అసిస్టెంటు స్టేటు కమీషనరు.
70 యన్. వేణుగోపాల్‌గారు, రిపోర్టరు, లెజిస్లేచరు శెక్రటరైటు.
71 కనకదండి భాస్కరరావుగారు, B. Sc., ఇన్‌కంటాక్సు ఇన్‌స్పెక్టరు, హైదరాబాదు.
72 మహమ్మదు రహీంతుల్లాగారు, M. L. A., ము॥ చైర్మన్, కడప.
73 రామకృష్ణ సమాజ గ్రంథాలయము.
74 రాపూరు రంగనాథంగారు, అడ్వొకేటు.
75 పోలేపల్లె వెంగన్న శ్రేష్ఠిగారు, వల్లూరు.
76 ముత్యాల లక్ష్మయ్యసెట్టి & సన్సు, కమీషన్ జనరల్ మర్చంట్సు, తిమ్మనచర్ల.
77 జూటూరు దాసప్ప & సన్సు, జనరల్ మర్చంట్సు.
78 యన్. నాగప్పగారు, స్కిన్ మర్చంట్సు.
79 యన్. కొమరప్ప & సన్స్ బ్యాంకర్సు, బళ్ళారి.
80 కె. లక్ష్మీపతి & సన్, కమీషన్ మర్చంట్సు.
81 కె. సన్న ఓంకారప్పగారు, మర్చంట్సు.
82 ఐ. వేంకటరత్నం నాయుడుగారు, L. M. P.,
83 జయంతి రుద్రయ్యశెట్టిగారు. బ్యాంకర్సు. రాయదుర్గము.
84 చిందనూరు నాగప్పశెట్టిగారు, కమీషన్ మర్చంట్సు.
85 తల్లం హనుమంతప్పశెట్టిగారు, కమీషన్ మర్చంట్సు.
86 టి. రాజశేఖర రెడ్డిగారు, అలంపురము.

87 రావుబహదూర్ టి. ఆర్. రామచంద్రశాస్త్రి గారు,
అడ్వొకేట్, కర్నూలు
గీతా సేవాసమితి, కళ్యాణదుర్గము.

88 శ్రీ మలుగూరు సంజీవప్పగారు, కనగానపల్లి.

89 ఎ. యం. ఓబలాపతి శ్రేష్ఠిగారు,
B. com., B. L., F. S. A. A., ఇన్‌కంటాక్సు
ప్రాక్టీషనరు, అడ్వొకేటు, మద్రాసు.

## పోషకులు

## రు. 50/-

1 శ్రీ ఎలిశెట్టి సుబ్బారాయుడుగారు, గోల్డు మర్చెంట్సు, నెల్లూరు. రు 58

2 గెల్లి సత్యనారాయణగుప్తగారు, విద్వాన్ విజయవాడ.

3 పసుమర్తి సుబ్బరాజుగారు, G. D. A., F. C. A.,
అసిస్టెంటు మానేజరు, ఇన్స్యూరెన్సు కార్పోరేషన్ ఆఫ్
ఇండియా, బొంబాయి.

4 తుమ్మల వేంకటేశ్వరరావుగారు, భీమడోలు.

5 కొండ ఈశ్వరరాజుగారు, గుండుకొలను.

6 ఉనికిలి వేంకటరాజుగారు.

7 నుదురుపాటి సత్యనారాయణగారు, భీమునిపట్టణము. రు 58

8 పూసర్ల బ॥ అప్పలనరసయ్యగారు, టింబరుమర్చెంట్సు
విజయనగరము. రు 58

9 వెలగపూడి సుందరరామ దత్తుగారు, నెల్లూరు.

10 తాయి మల్లిఖార్జునప్ప శెట్టిగారు, మర్చంట్సు, రాయదుర్గము.

# ప్రస్తావనము

'పత్రం పుష్పం ఫలం తోయం...' భక్తితో ఎవరైన జీవరకు ఆకు పువ్వు పండు నీరు వంటి స్వల్ప పదార్థములనైన నర్పింతురో వాని ప్రేమతో స్వీకరింతునని భగవద్వాక్యము. అత్యల్పమగు తృణముతో ప్రారంభించిన ఈ సర్వార్పణ విధానము ఆతృణఫలితములగు పుష్పఫలములతో బూర్తిగాక, దానికి సారభూతమై ప్రాణమైన జలరసమువరకు జనియుండుట గాంచనగును.

అంతియగాక నీత్యాగనిరతి బాహ్యమున హేయముగ నున్న గడ్డిపోచతో నాందిని బాడియున్నను, క్రమముగ నభివృద్ధిగాంచి, లోకమున మాననీయ వస్తుసముదాయము వరకు బయనించి, వస్తువాహనములు, మణులు మాన్యములు, గుడులు గోపురములు, వాపీ కూప తటాకములు, ఆరామక్షేత్రములు మొదలగు అసంఖ్యాకరూపముల రూపొంది పరమేశ్వరార్పణము గావింపబడియున్నవి.

అదేవిధముగ, దన కమూల్యములైన బాహ్య వస్తు సమూహము నా సర్వేశ్వరున కర్పించి యానందించుట మాత్రముగాక, మానవుడు తనయం దంతర్గతశక్తి సంపదను గూడ నా పరమాత్మునికంకితము గావించుకొని, తరించినట్లు సమ్మోద మొందుచున్నాడు. ఎందరు గాన కోకిలముల తమ గాన మధుర సుధారసముచే నా భగవంతుని పొమ్మసిల్లచేయ లేదు! ఎందరు కవితా కళోపాసకులు తమ కవనరత్నములచే నా దేవుని యలంకరించి మైమరువలేదు!

అట్లు మానవుని సర్వకళాశక్తులు, లలిత సుందర మధుర శక్తులు, పరమాత్మనుండి జీవునిలో నభివ్యక్తమై మరల జీవుని ద్వారమున నా భగవదర్పితమై అందు లయించుచున్నవిగదా! బింబమున ప్రతిబింబము లయించుటయం దాశ్చర్యమేమి? మేఘజలము సాగరు జేరుటయందు వింత ఏమి? శిశువు తల్లిని బొందుటలో విశేషమేమి! అది సహజము సముచితము. జీవుని నిర్మాణాత్మకశక్తి సంపద యీ విధముగ భగవదర్పితమై యా సర్వశక్తి స్వరూపమున నేకమయి సార్థకమగును గదా! ఈ విధానమే జీవత్వము బ్రహ్మత్వమున లయించి ఏకత్వము నొందుట కుపక్రమణము. ఇదియే అద్వైత సిద్ధి కుపాయము.

ఈ సూత్రము ననుసరించి మన మాతాజీ మొదటి నుండి తన లలితకళా శక్తులగు సంకీర్తన గానముల నా దేవ దేవు గీర్తించుటయం దుపయోగించుటయం దలవాటు గల దగుటచే గాలక్రమమున దన రచన వచనములగూడ నా సర్వ కళాస్వరూపుని పాదపద్మముల కంకితమొనర్చుటయం దాశ్చ ర్యము లేదు. తన జీవిత సర్వస్వమునే భగవదర్పణము గావించియుండెగదా!

కాన దేశముల నాతని గీర్తించుచు, వచించుచు, బర్య టించుచున్న మన మాతాజీ అంతటితో తృప్తిగాంచక యీ రచన రూపమునగూడ శ్రీ దేవదేవుని సేవగావించి తరించుటకై సంకల్పించి, 1953 లోనే 'మన రామకృష్ణుడు' అను గ్రంథ మును మనన సాధనమునకై లిఖించుకొనెను. 'మన రామ కృష్ణుడు' అను యీ పుస్తకమునకు ముందుగ 'మన శారదా

...

మాయి' 'మన వివేకానందుడు' ప్రకటితమై దేశముల ప్రుమ్మరుచు, మన రామకృష్ణుని గీర్తించుచుండుటచే, 'మన రామకృష్ణుడు' గూడ శ్రీ శారదా శతవార్షిక జయంతి సందర్భమున ప్రకటింపబడెను. ఆ యపూర్వ అవతారమూర్తిని, అత్యధునాతన ఆదర్శస్వరూపమును నేడు కొనియాడనివా రెవరు? సర్వాదర్శము లతనిలో బ్రస్ఫుటములుగదా !

ఆ 'మన రామకృష్ణుడు' చిన్నదయ్యును దెలుగునాట నెల్లెడల బ్రవేశించి, ప్రస్తుతము వినూత్నశోభతో ద్వితీయ ముద్రణమున నేడు మనముందు అవతరించుట కడుంగడు ఆనందదాయకము. ఈ ముద్రణమున ననేక నూతన విశేషములు, ముఖ్యముగ ప్రధాన శిష్యుల జీవితవిషయములు చేర్చబడుటచే బాఠకుల కధికతరోపయుక్త మయినదని చెప్పక దప్పదు.

కాన యీ సుందరరూపమున 'మన రామకృష్ణుడు' దేశదేశముల కరిగి, భక్త హృదయముల జొచ్చి, మార్గదర్శియై, వారిముక్తి మార్గమున దోడునీడయై వెలుగొందుగాక! అందు లకు బరమేశ్వరు డనుగ్రహించును గాక!

బాపట్ల,

6—9—60.

# ప్రేమాంకితము

నా యాధ్యాత్మిక జీవిత వికాసమునకు
పరమ కారణమైన

మా

గురువర్యులు

శ్రీ అనుభవానంద స్వాములవారికి

ఓం

శ్రీ జగద్గురు మూర్తయే నమః

# మన రామకృష్ణుడు

## భూమిక

శ్లో॥ స్థాపకాయ చ ధర్మస్య సర్వధర్మస్వరూపిణే।
అవతార వరిష్ఠాయ రామకృష్ణాయ తే నమః॥

ఆధ్యాత్మికానంద విభూతి యన, క్షణికమై బుద్బుద ప్రాయమై నశ్వరమైయొప్పు ప్రాపంచిక సుఖ సముదాయము నకు భిన్నమై, అతీంద్రియమై, ద్వంద్వాతీతమై అవ్యయమై, అఖండమై, శాశ్వతమై, యుత్కృష్టమైనదియే యాబ్రహ్మానంద మని మన ప్రాచీన ఋషివర్యుల, యతిపుంగవుల, అనుభవ పరుల, అవతార వరేణ్యుల అభిమతము. ఇట్టి సర్వోత్కృష్ట మగు ఆధ్యాత్మిక తత్త్వమును అనుభవించి, ఆయానంద సందే శమును దేశదేశముల నసంఖ్యాక మహాపురుషులచే ప్రకటింప జేయుచు, నద్దానిచే దానుసహితము పునీతమై యొప్పారు చున్నది మన భరతభూమి. ఆకాశమును ఒరయుచు నత్యు న్నతమై తమ ప్రపంచ విజయత్వమును సూచించుచున్నవో యను హిమాలయ పర్వతశ్రేణి 'నిశ్చలం మోక్ష ఉచ్యతే' నిశ్చలత్వమే మోక్షమను యోగశిఖోపనిషదుక్తి చాటుచున్న నిశ్చలత్వమును, ఉన్నతమును అగు ఆత్మానుభూతిని నిరూపించు

దులు హిమవత్పర్వత శ్రేణియందును, గోదావరి కృష్ణాదులు పశ్చిమ కనుమలలోను, నర్మదాదికము వింధ్య నగముల యందును ఉద్భవించి, దేశదేశముల గ్రుమ్మరి, తమ నిర్మ లోదకములచే భరతభూమిని సస్యశ్యామల మొనరించి, యసం ఖ్యాక ప్రాణికోటిని బవిత్రీభూత మొనరించుచు, దుదకు 'త్యాగేనైకే అమృతత్వ మానశుః' త్యాగముచేతనే అమృ తత్వసిద్ధి యను కైవల్యోపనిషద్వాక్యమును మనకు మరల మరల జ్ఞప్తికి దెచ్చుచున్నవో యనునట్లు, తమ ప్రత్యేక నామరూపముల వర్జించి, ఆద్యంత రహితమును గంభీరమును అగు మహాసాగరమున లయించుచున్నవి. అందుచేత 'యథా నద్య స్స్యందమానా స్సముద్రేస్తం గచ్ఛంతి నామరూపే విహాయ' నదు లేవిధముగ దమ నామరూపముల వదలి జలధి జేరుచున్నవో అని శాస్త్రము సహితము యీ నదులను ఉదా హరణముగ గ్రహించి, బ్రహ్మవిదులు బ్రహ్మమున దమ నామ రూపముల ద్యజించి లయించెదరని ఆదేశించుచున్నది. కాన నాధ్యాత్మికౌన్నత్యమును జాటు పర్వతశ్రేణులును, పవిత్రతయే ఆధ్యాత్మిక సౌధమునకు బ్రాతిపదిక యని సూచించు నిర్మల స్రవంతులును వెలుగొందు మన భారతదేశము, భక్తవరేణ్యుల, జ్ఞానశ్రేష్ఠుల నివాసస్థానమై, పట్టుగొమ్మయై, పుట్టినిల్లయి యనుటయం దాశ్చర్య మావంతయు లేదు. మరియు గంటకా వృతమగు గులాబికుసుమ సుగంధము జాతి మత వర్ణ విభేదముల బాటింపక సర్వులచే నాఘ్రాణింపబడుచుండురీతి, మన మహా పురుషులు ఆదర్శులై 'స్వయం తీర్ణః పరాన్తారయతి' అను ఆర్యోక్తి చందము తాము తరించి యితరుల దరింప జేతురు

గదా ! అట్టి వైరాగ్య విభూషితుల, స్వార్థ రహితుల, మహర్షి గణముల, తపోధనుల గని, పెంచి, యావత్ప్రపంచమునకు జ్ఞాన దీప్తిపుంజముల ప్రసాదించు పుణ్యభూమి ధర్మక్షేత్రము యనియు ననదగు మన భారతావని 'A nation of thinkers a creation of Philosophers' ధీమంతులలోకము, తత్త్వవేత్తల కర్మాగారము అని యసంఖ్యాక పండిత వర్గముచే వేనోళ్ళ కీర్తింపబడుచున్నది. అది భారతీయుల గర్వకారణము అదృష్ట హేతువు.

'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥' అను గీతా వాక్యమురీతి సాధురక్షణ ధర్మ స్థాపనములకై ప్రతియుగమున బరమేశ్వరు డవతరించుచుండును. ఈ యవతారపురుషులలో దైవాంశ మధికముగను మానవత్వ మల్పముగను గోచరించును. సాక్షాద్భగవానుడు ప్రపంచోద్ధరణమునకై యరుదెంచి మానవోపాధిని దాల్చియుండియు బాల్యమునుండియు దన దివ్యత్వము నెల్లడిచేయుచునే యుండును. సంకుచిత స్థూలశరీరమును బొందియున్నను, అనంతమగు నాదేవత్వము దీనియం దిమడజాలక బరిపరి విధముల బహిర్గతమై వ్యక్త మగుచుండును. గజరాజు ఒక కుటిని ప్రవేశింప నాకుటీరము తెలుపకయే గజపతియునికి వ్యక్తమైనట్లు, అఖండమును అవ్యయమును అగు ఆ భగవంతుడు యీషడ్భావవికార సంజనిత శరీరగతమగుటచే నా దేహము భరింపజాలక నాభగవంతుని స్పష్టపరచును. ప్రజ్వలితమగు జ్యోతిపై నొక బుట్టనుంచినచో నాజ్యోతి దానినుండి

రంధ్రములద్వారా బయల్వెడలు చందమున, బ్రహ్మ చైతన్య జ్యోతియు నీదశేంద్రియ యుక్తమగు శరీరమునుండి వెలువడు టకు యత్నించుచున్నది. పూవు పుట్టగనే తన సువాసనల వెదజల్లునట్లు అవతారపురుషులు జనించిన నాటనుండి తమ భగవత్తత్త్వమును జాటుచున్నారు. అట్లు ప్రత్యక్ష భగవదంశ సంభూతులగుటచేతనే వారు యనేక ప్రజల దరింపజేయు చున్నారు. అట్టివారలే దశరథ రామచంద్రుడును, దేవకీగర్భ సంజాతుడగు శ్రీకృష్ణపరమాత్మయు, శుద్ధోధన మహారాజు పుత్రుడై త్యాగధనుడైన బుద్ధభగవానుడు మొదలైనవారు.

మహాపురుషులుగూడ నవతారపురుషులవలె నీప్రపంచ మున నుద్భవించి ప్రపంచాతీతులై మని తమ శక్తిచే గొందరు ముముక్షువుల దరింపజేయుచున్నారు. అందు గపిల నారదాదులు నిత్యసిద్ధులనియు, బూర్వసంస్కారములచే బ్రహ్లాద సనకాదులు జన్మసిద్ధులనియు, జనించినదాది సాధనాదుల నొనరించి తరించిన ధృవాదులు కర్మసిద్ధులనియు, గురువుయొక్క అనుగ్రహముచే మోక్షమును బొందిన వాల్మీకి నామదేవాదులు కృపాసిద్ధు లనియు, నీ మహాపురుషులు చతుర్విధములు. వీరియందు దేవత్వ మల్పముగనుండి మానవత్వ మెక్కువగ నుండును. మరియు నుపనిషత్తులు గీత వేదాంతసూత్రములు నాబడు ప్రస్థానత్రయ భాష్యకర్తయు, నద్వైతమత స్థాపకుడును, యతి వరేణ్యుడును అయిన శంకరుడును; బ్రహ్మము శరీరత్రయ విశిష్టమైయుండ, జీవ బ్రహ్మములకు నంశాంశిభావ సంబంధము గలదని బోధించు రామానుజుడును; బ్రహ్మము సగుణమై, జీవ ప్రకృతి బ్రహ్మములు పంచవిభేదముల నలరారునను మధ్వా

చార్యుడును; మరియు వల్లభ, నింబార్క, కబీరు, క్రీస్తు, మహమ్మదు మొదలైన ప్రవక్తలును; మతోద్ధారకులును; త్యాగరాజు, రామదాసు, వామదేవాది భక్తాగ్రగణ్యులును; రమణ, అరవిందాది తపస్సంపన్నులును మహాపురుష శ్రేణికి జెందిన వారు. జీవుడు మానవుడై జన్మించి, సాధనాదిచే మానవలక్షణముల గ్రమముగ నతిక్రమించి దైవలక్షణముల నొందుచుండుట వీరిలో గాంచనగును. వీరినిగూడ నవతారపురుషులని యనుట గలదుగాని నైజమున వ్యత్యాసము పొడగట్టును. అవతార పురుషులు సంకల్పమాత్రమున నసంఖ్యాక ముముక్షువుల దరింపజేయుటయేగాక, వారి తారక సందేశము అచిర కాలమున ప్రపంచ వ్యాప్తినొంది, చిరకాలము మానవుల కాదర్శ ధర్మమై యొప్పారుచుండును. కాని మహాపురుషుల శక్తి పరిమితమై తత్కాలబద్ధమై చెల్వారును. శ్రీరామకృష్ణ వచనానుసరణి, మహాపురుషులు కొలదిమందిని గొంపోవు బండి వంటి వారై యుండ, అవతారపురుషులు వేలజనమును గమ్యమును జేర్చు ధూమశకటమువోలె నుండురు.

## అవతార విశేషము

అట్లయినచో మన రామకృష్ణుడు మహాపురుషుడా? అవతారపురుషుడా? యని యిసుమంత విచారింతము గాక! అతడు కృపాసిద్ధుడని యందమా? అతని జీవితమున గుర్వనుగ్రహముచే నొక సిద్ధినిగూడ నతడు పొందలేదనుట విదితము. కర్మసిద్ధుడని వాకొనినచో, సాధనాదుల నెంత తీవ్రముగ జేసిన

భగవద్దర్శనప్రాప్తి కలుగునో యను విషయమును బోధించుటకు మాత్రమే అతని సాధన యగుటచే గర్మసిద్ధుడనుటకు వీలులేదు. జన్మసిద్ధు డందమా? అగునుగాని పూర్వజన్మ సంస్కారమువలన సిద్ధత్వము నొందినట్లు గాంచము. నిత్యసిద్ధత్వము వచింతమా యనిన, నగునుగాని జన్మసిద్ధులకు మించిన విధాన లోకమున కుపయుక్తమై, సాధక చయమునకు నిత్యసందేశము నొసగుట యే గాక, తారక మంత్రమై అతడు యొప్పారెను.

కావున మన రామకృష్ణుడు కేవలము సిద్ధుడై, మహా పురుషమాత్రుడుగాక, సర్వమత సామరస్యమును జాటుచు, నందలి సారమును గ్రోలి, అనుభవానందమున లీనమై, సర్వ దేవతల సాక్షాత్కరింపజేసికొని, వారి దనయందు లయింప జేయుచు, సర్వ సౌభ్రాతృత్వమును బ్రకటించి, సకల మత ములు, మార్గములును నేకమే యని 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' సత్పదార్థము ఒక్కటియేకాని పండితులు వివిధరీతుల వక్కాణించెదరు అను శాస్త్రవాక్యమును శ్రుత్యుక్త్యనుభవ సహితముగ వివరించి, సర్వముకంటె బరమేశ్వరుని అధిక ముగ బ్రేమించినగాని తత్ప్రాప్తి కలుగనేరదని ఘోషిపరచి, కేవల సాధనావతారమని సర్వత్ర నర్చింపబడుచున్న మన రామకృష్ణ పరమహంసదేవుడు సర్వదేవదేవీ స్వరూపుడై చెలొందింది 'అవతార వరిష్ఠాయ' అను చందము యావత్ప్ర పంచమున సర్వముముక్షుకోటిచే గొల్వబడుచుండుట నేడు మనము కండ్లార వీక్షించుచున్నాము. అంతియగాక, నా పురుషోత్తముడు జన్మించినదాది తన భగవదంశముల ననే కము ఆశ్రితులకు గోచరింపజేయుటయు విదితము. మరియు

నచిరకాలముననే తన ఆధ్యాత్మిక తేజోవిభూతిచే సకల ప్రపంచమును ప్రకాశింపజేసి, అసంఖ్యాక ముముక్షువులకు శరణ్యమై గమ్యమై విరాజిల్లుటయు వ్యక్తము. కాన మన శ్రీ రామకృష్ణదేవుని మహాపురుష శ్రేణిలో గణింపక, నవతారపురుషులలో ప్రముఖునిగ బరిగణించుట సముచితము, అవసరమని వేరుగ వచింప ననావశ్యకముగదా!

పై వచించినవిధాన శ్రీ రామకృష్ణదేవుడు ప్రకటించియున్న సర్వమత సమైక్యతను గ్రహించి అనుసరింప యత్నింతము. కాని చదువరులారా, ఒక్కసారిగా ఆ విధానముల ననుగమింప నసాధ్యముగదా! అందుచే నా సర్వసమత్వమునందు కొనుట కా మహానుభావుడు ప్రథమమున బాల్యమునుండి పొట్టి సాధనములచే బునాదిని వైచెనో మన మొకించుక గ్రహింపవలయును. కాన ఆ యవతార వరేణ్యుని పుట్టుపూర్వోత్తరము లెవ్వియో, ఆ సాధనావిధాన మెద్దియో, ఆ బోధనాసరళి ఎట్టిదో, ఆ విశాల నిష్కల్మష నిర్మల ప్రేమ ఎట్లు సాధ్యమయ్యెనో, ఆ త్యాగనిరతి ఎట్టిదో మున్నగు విషయముల నొకించుక బరిశీలించినగాని యవి మనకు సాధ్యములు కావు. మన రామకృష్ణుని జీవిత విశేషములలో సాధనావిధానములలో నొక ఉత్కృష్టత గలదు. సాధారణముగా నొక వ్యక్తి యేదియో యొక విషయమును, ఒక మతమును, ఒక యిష్టదైవమును గ్రహించి ఆచరించును గాని మన రామకృష్ణదేవుడు మాత్రము సర్వమత రహస్యముల, సర్వ సిద్ధాంత వివరణముల, సమస్త దేవతల 'మూడేరోజులలోన బుద్ధునటులే మూన్నాళ్ళలో గ్రీస్తు నామూడేరోజులలో మహమ్మదు,

పరంబౌ నిర్వికల్పంబు నా మూడేనాడుల నెవ్వాడైన గనెనే' అనునట్లు వశపరచుకొని ఎవ డేవిషయము, ఏ సాక్షాత్కారము, ఏ యనుభవము గోరునో వారివారికి దదనుగుణముగ నుపదేశించును. ఇది యందరకు సాధ్యమా? ఇట్టి సర్వతోముఖప్రజ్ఞ సకల సృష్టి స్థితి లయ కర్త్రియగు శ్రీ విశ్వేశ్వరీ ధ్యానానందోన్మత్తుడగు మన రామకృష్ణ పరమహంస గురుదేవునికే ముమ్మాటికి సాధ్యము, సుసాధ్యము!

## మా తా పి త లు

వంగరాష్ట్రమున హుగ్లీమండలములో దర్యాపూరునాబడు గ్రామమున చటర్జీవంశస్థుడగు మాణిక్యరామ్ చటర్జీ యను నతడు వసించుచుండెను వంశపారంపర్యముగ కౌశల్యాతనయుడును, జానకీపతియు, సత్యవాక్యపరిపాలనా దురంధరుండును, భక్తజన పోషకుండును, ఆదర్శ గృహస్థును అగు శ్రీ రామచంద్రమూర్తి యీ వంశమునకు కులదైవ మగుటచే నీ వంశమునగల ప్రతియొక్కరినామమున 'రామ' శబ్ద మిమిడి యుండును. మాణిక్యరామదంపతులు జీవితాదర్శముల సక్రమముగ నెరవేర్చుచు, సత్యసంధులగుచు నతిథిసేవ గావించుచు, ప్రేమరస మొలికించు హృదయముగల్గి నిర్లిప్త జీవితముల గడుపుచుండిరి. 1775 వ సంవత్సరమున నా దంపతులకు మన రామకృష్ణుని దండ్రియైన ధన్యజీవి ఖుదీరామ చటోపాధ్యాయుడుద్భవించెను. ఈతడును దండ్రికి మించిన సుగుణముల బడసి ఆ గ్రామమున గీర్తిగాంచెను. మాణిక్యరాముని మరణానంత

రము ఖుదీరాముడు దర్యాపూరు గ్రామనివాసియగు జమీం దారుడు రామానందరాయి దెచ్చిన ఒక అసత్యపు వ్యాజ్య మునందు, దాను బొల్గొన సమ్మతింపక, తన సత్యవ్రతదీక్షా భంగమునకు దన హృదయ మంగీకరింపదని యాగ్రామమును వీడి కామారి పుష్కరిణి కరుదెంచెను. ప్రపంచమున బూర్తిగ రోసి, ప్రపంచవిషయముల సక్తత దొలగించి, శ్రీ రఘువీరు నుపాసించుచు, భక్తియుక్తుడై, సంతత ధ్యాన తత్పరుడై ఖుదీ రాముడు మెలగజొచ్చెను.

ఒక దినమున నతడు సమీపగ్రామమున కేగి తిరిగి వచ్చుచు నాతపబాధచే డస్సి, యొక వృక్షచ్ఛాయను విశ్ర మించెను. అప్పు డాతని స్వప్నమున శ్రీరామచంద్రుడు బాలుని రూపమున గన్పడి 'నే నిట బూజాదులు లేక యున్నాను. మీ గృహమునకు నన్ను గొంపొమ్ము' అని పలుక, 'ప్రభూ! నేను మిగుల పేదనే! నీకేలోపములు లేక నిన్ను నే నర్చింపగలనా?' అని యధైర్యమున ఖుదీరాముడు ప్రశ్నింప, 'నీ పూజాదులకు సంతుష్టాంతరంగుడనై యుందు' నని యా మూర్తి మాయబలికి అదృశ్యమైనటుల గోచరించెను. అంత నానందాశ్చర్యముల మేల్కొని 'కలయా? నిజమా?' అని తర్కించుచు కొనుచు నలుదెసల బరికించి చూడ దనకు స్వప్నమున గనుపించిన స్థలము ముందు గానుపించెను. వెంటనే యాప్రదేశమున కతడు జేరి చూడ, నట నొక పాదపచ్ఛాయను ఒక సర్పరాజము యొక్క పడగక్రింద సాలగ్రామ మొండు అతని దృష్టికి సోకెను. అతనిగాంచి సర్ప మదృశ్యముకాగా, ఆతడు సాలగ్రామమును బులకాంకిత శరీరుడై గ్రహించి, దాని లక్షణముల బరీక్షించి,

తన యిష్టమూర్తియు కులదైవమును అగు శ్రీ రఘువీరు సాల గ్రామమూర్తియని తెలిసి మిక్కిలి సంతోషాంతరంగమున దాని గృహమునకు గొంపోయెను. నాటనుండి పూర్వముకంటె నత్యధిక భక్తితన్మయత్వమున శ్రీరాముని యుపాసన జేయ సాగెను. కాలక్రమమున నా యుపాసనాఫలితముగ సీతామహా దేవి అష్టవర్ష ప్రాయ బాలికారూపమున ఖుదీరామునకు సాక్షా త్కరించుచు, నతడు వృక్షసమూహముల బూజకై పూలు గోయు సమయమున నతని కందని కొమ్మల వంచి సహాయ మొనర్చుచుండెడిది. చూచితిరా, ఆతీవ్ర యుపాసనాఫలితము! ఈ యుపాసనా విధానమే మన శ్రీరామకృష్ణునందు ప్రవహించి, యతనికి సర్వదేవతల హస్తగత మొనర్చెను. ఖుదీరాము డిట్టి భక్తిపరతంత్రుడుగా నుండ నతని సహధర్మచారిణి యగు చంద్రామణియు నెట్టి సుగుణఖనియో కూడ మన మొకించుక దెలిసికొందము.

ఖుదీరామునకు సరిసమానమగు గుణగణముల నొప్పా రుచు, సర్వవిషయముల నాతని యడుగుజాడల వర్తిం చుచు, నర్థాంగి సహధర్మచారిణి యను పదముల కర్థ్హమాయై, కల్లకపటముల నెరుగక, నందరకు దోడునీడయై, త్యాగమున కాటపట్టువై యొప్పారినది చంద్రామణీదేవి. ఈమె యంతటి త్యాగమూర్తి యగుటచేత, త్యాగనిధానుడగు పుత్రరత్న మును గని త్యాగులగు ముముక్షువుల కొరకై యతని ప్రపంచ మునకు నామె త్యాగ మొనరించెను. ఆమె త్యాగనిరతి కొక యుదాహరణమును గాంచుడు! దక్షిణేశ్వరమున మన రామ కృష్ణుడు వసించు నపుడు చంద్రాదేవిగూడ అందుండెడిది.

ఆయాలయ ధర్మకర్తయగు మధురబాబు శ్రీరామకృష్ణునందు గల భక్తిచే దననుండి దేనినైన స్వీకరింపుడని గురుదేవుని కోరెను. కాని త్యాగరాజగు మన రామకృష్ణుడు దేనిని గోరడయ్యెను. అందుచే రామకృష్ణు నర్థించిన ప్రయోజనము లేదని మధురుడు గ్రహించి, వృద్ధురాలగు చంద్రాదేవికడ కేగి 'అమ్మా, మీరు దేనినైన నానుండి గ్రహింప బ్రార్థించెదను. మీకేది కావలయునో కోరుడు' అని పలికెను. అందుల కామెయు, 'నాయనా, నాకు వలయు సౌకర్యముల నీవే చేయుచున్నావు గదా! ఇంక వేరేమి నాకు గావలయు' నని నుడువ, నాతడు సమ్మతింపక బలవంతముసేయ, నామె తీవ్ర యోచనా తత్పరయై మెల్లగ 'బాబూ, నన్ను బలవంత పెట్టుచున్నావు కాన నేను పండ్లపొడి చేసికొనుట కొక కానీ పొగాకును పంపుము' అని దరహాసిత వదనారవిందయై పలికెను. అంత మధురనాథు డచ్చెరువొంది 'ఆహా! ఇట్టి త్యాగనిధి కాననే యీయామె త్యాగధినాథుడగు శ్రీరామకృష్ణుని బుత్రునిగా బడసినది' అని యానందించెను.

## అవతరణము

భక్తాగ్రగణ్యుడగు ఖుదీరాముడు పాదచారియై యతి దీర్ఘమును ప్రయాస యుతమును అగు రామేశ్వరయాత్రను 1824 వ సంవత్సరమున గావించి వచ్చెను. ఈయాత్రానంతర మున జనించిన తన ద్వితీయ పుత్రునికి రామేశ్వరుడని యే నామకరణము నతడొనరించెను. అదేవిధముగ 1836 వ సంవ

త్సరములో గయ కేగి పితృదేవతలకు బిండప్రదాన మొనరింప దలంపు జనించుటచే తాను యిరువది వత్సరముల ముదిమియం దున్నను దృఢనిశ్చయుడై ధైర్యముతో బాదచారియై ప్రయాణమై వెడలెను. గయాక్షేత్రాధిపతియు గదాధర నామ ధేయుడగు శ్రీమహావిష్ణువును దర్శించి, యట పిండప్రదా నాదుల జరిపించి తృప్తిగాంచి, తన సంకల్ప మీడేరినందుల కత డమితానందమునొందెను. సంపూర్ణ తృప్తుడై యతడు రాత్రి నిద్రించుచుండ నతని కొక స్వప్నము గలిగెను. అందు అతడు గదాధర దేవాలయమునకు వెడలెను. అట గదాధరుడు తనను బిలిచి 'లోకరక్షణార్థము నేను ప్రపంచమున జన్మింప నుంటిని. నీ భక్తిశ్రద్ధలకు సంతసించితిని. కాన నీ గృహమున జనింతును' అని పలుకుటయు, నందులకు దానంగీకరింప నేరక 'నిరుపేదను గదా! మీకు సౌకర్యముల జేయజాలనే!' యని తా వచించుటయు, నయినను గదాధరస్వామి అభయ మొసం గుటయు జరిగినటుల సా నిశీథి దివ్యస్వప్నమునుగాంచి, తన గృహ మొక పవిత్ర పురుషునిచే బావనము గాబోవుచున్నదని మది యానందించి యుప్పొంగి, ఆ విషయమును మరల మరల తలంచుకొనుచు, అతడు ఆనందాంబుధి నాడు ఓలలాడెను. ఈవిషయమును దలంచినచో మన రామకృష్ణుడే శ్రీమన్నారా యణుడని వ్యక్తముగదా !

పై విధాన ఖుదీరాముడు గయాక్షేత్రమున నుండ నొక దినమున కామారిపుష్కరిణిలోగల చంద్రాదేవి తన యింటికి బ్రక్కనేగల శివాలయమునకు బరిచారికతో పూజా ర్థమై యేగెను. అంత నాశివలింగమునుండి యొక దివ్యజ్యోతి

బయల్వెడలి ఆమెను చుట్టుముట్టి చంద్రాదేవి దేహమున లీనమై అదృశ్యమయ్యెను. తక్షణమే ఆమె బాహ్యస్మృతి రహితయై నేలకొరిగెను. వెంటనున్న ధన్యజీవియగు ధని చంద్రాదేవికి యుపచారములచే బాహ్యస్పృహను గలిగించెను. నాడే చంద్రాదేవి గర్భము ధరించుట! ఈ సంఘటనము గాంచు-చో మన రామకృష్ణుడు పరమ శివస్వరూపమనియే విదితమగుచున్నదిగదా! ఈ విషయమును చంద్రాదేవిద్వారా గయనుండి అరుదెంచిన ఖుదీరాము డాలకించి, గయాక్షేత్రమున తన స్వప్నము యథార్థమని గ్రహించి, తన యనుభవము నామెకు దెలిపెను. ఆ పుణ్యదంపతు లావిషయమునకు ఆశ్చర్యానంద పరవశులై నాడు రాజిల్లిరి. చంద్రాదేవి గర్భము అభివృద్ధి నొందుకొలదిని యనేక అద్భుత అనుభవములు ఆమెకు గలుగజొచ్చెను. ఒక్కొక్కనాడు తన శయనాగారమున దేవతలు తిరుగాడు చుండుటయు, ననేక అవిస్పష్ట దివ్యవాక్కులు శ్రవణగోచర మగుచుండుటయు, బసిపిల్లల కాలి గజ్జల శబ్దములు వినబడుటయు మొదలుగాగల దివ్యదృశ్యములు ఆమెకు విస్పష్టముగ గనబడుచుండెను.

అంత గొంతకాలమునకు అవిద్యాంధకారమును బరిమార్చు జ్ఞాన దివాకరువోలె జంద్రామణీదేవి గర్భమున 1836 దుర్ముఖి నామ సంవత్సరమున ఫిబ్రవరి 17వ తేది ఫాల్గుణ శుద్ధ విదియ బుధవారమున 'ఓ అజ్ఞ మానవులారా, నిద్ర మేల్కొనుడు. ఆహారనిద్రాదులే జీవిత పరమావధి గావు సుడీ! కామకాంచనములు గావు సుమా! సర్వాతీతమగు పరమాత్మ

సాక్షాత్కారము బొందిననాఁడే జీవిత ధన్యత్వము. జీవిత గమ్యమును బోధింప నే నరుదెంచితిని. నా యడుగుజాడల ననుసరించుచో ముక్తిహస్తగతము' అని దుఃఖనిమగ్నులగు ప్రపంచజీవుల ప్రబోధించుచున్నటుల, ప్రభాతసమయమున ప్రపంచోద్ధరణ కార్యభారమును వహింపనున్న సద్గురువరేణ్యుఁడు, అవతారవరిష్ఠుఁడు శ్రీ రామకృష్ణదేవు డుద్భవించెను. వెంటనే జగమంతయు పావనమై వెలసెను. ఆప్రభాతమున విహంగ సమూహము కిలకిలారవములు సల్పుచు, ఆత్మసాక్షాత్కారవంతుఁడగు జ్ఞాని యొక్క యానంద కీర్తనముల గావించుచుండెను. బ్రహ్మను భూతిపరు లెల్లప్పుడు సర్వసమత్వమున నుండుచు, వికాస యుక్తులై తనరుదురని తెల్పుచున్నవో యనునటుల వృక్ష సంతానముల సుమసంచయము విప్పారి సుగంధముల వెదజల్లుచుండెను. ఇట్లు అన్వయార్థముల సర్వప్రకృతియు మన శ్రీ రామకృష్ణదేవుని యవతరణమునకు స్వాగతమొసంగెను.

ఇట్లు జనించిన బాలుని నొకచో నుంచి, తల్లికి సాయమొనర్పనేగిన ధని యను ధన్యాత్మ మరల బిడ్డను జూడ, ఆశ్చర్యకరముగ నతఁడు పూర్వస్థలమునగాక సమీపమునగల బూదిగుంటలో బొర్లాడుచు, 'ఈ ప్రాపంచిక సౌఖ్యముల నేనాఁడు భస్మము గావించి దాని మేన ధరింతుమో నాఁడే మనకు బ్రహ్మవిభూతి లభ్యము' అని అవ్యక్తముగ బోధించుచుండెనో యనునట్లుండెను. ఆ యుపదేశమును ఆ బాలకుఁడు అక్షరములు లేకయే బోధింప నవ్యక్తముగనే గ్రహించియుండును ఆ ధని. కాన వెంటనే ధని ఆబిడ్డను జేగొని 'ఈ శిశువు లోకపూజ్యతను బొందు మహానీయు'డని భావించి సంతసమును అపారముగ

బొందెను. ఇక ఖుదీరాముని ఆనందమునకు మేరయే లేదు. తన దివ్యానుభవము ఫలించిన నే వ్యక్తి కానందము కలుగదు ! అంత ఖుదీరాముడు జ్యోతిష్కుల రావించి, జాతకమును వ్రాయింప, 'నీ కుర్రవాడు అసాధారణవ్యక్తియై లోకపూజ్యతను బొందుననియు, భగవదంశ సంభూతు'డనియు నా పండితులు తెలిపిరి. ఖుదీరాముడును తన గయాక్షేత్రానుభవము ననుసరించి బాలునకు గదాధరుడని నామకరణ మొనరించెను.

## బాల్య లీల

దినదిన ప్రవర్ధమానమగుచున్న ఆ కుర్రవాడు శైశవమునుండి తన దేవత్వమును వివిధ తెరంగుల దర్శించి వ్యక్త మొనర్చుచుండెను. ఒక పర్యాయము చంద్రామణీదేవి శిశువు నెత్తుకొని కూర్చుండియుండ నతడు మిగుల తేలికగనై భయాశ్చర్యముల గలుగ జేసెను. మరల నొకతరి మోయలేనంత భారముగ నత డగుచుండెను. సర్వసాధారణమైన జోలపాటల బాడినంత నిత డధికముగ విలపించును. అంతియగాక బాలుని యేడవమాసమున నాజనని ఆతని తొట్టిలో నిద్రబుచ్చి కార్యాంతర నిమగ్నయై, మరల గొంతదడవునకు శిశువును దిలకింప, దన ముద్దుల కుమారునికిమారుగా గాషాయవస్త్రమును, దీర్ఘమైన గడ్డమును, సుమారు నలువది వత్సరముల ప్రాయముగల యొక వ్యక్తియందు గోచరించెను. వెంటనే ఆమె భయభ్రాంతచిత్తయై ఖుదీరాముని బిలిచి యువ్వురు మరల జూడ, తొట్టిలో దన చిన్న గదాధరుడే నిద్రించు

చుండెను. కాని యామె తాను జూచిన ఆజానుబాహు విషయము జెప్పి, అది యేదియో దుష్టగ్రహమనియు, అది పసి పాపని బట్టి పీడించుచున్నదనియు, దాని భూతవైద్యులచే దగు చికిత్స జేయించినగాని తనకు దృష్టి కలుగదనియు, భర్తతో నొక్కి వక్కాణించెను. కాని దైవానుగ్రహ జన్ముడగు నీ బాలుని ఎట్టి గ్రహములు దరిజేరవనియు ఖుదీరాముడు ధైర్యము జెప్పి ఆమె నోదార్చెను. భావిజీవితమున నితరులకు నావేశించియున్న అజ్ఞానగ్రహముల నిర్మూలించు నాబాలునికి దుష్టగ్రహములు ఆవేశించు టేడ? దానిచే నాతనికి బాధ యేడ? తా నికముందు అట్లు కానుంటిననియు, భయము వలదనియు, జననిని హెచ్చరించుటకో యనునట్లు దన భవిష్యద్రూపమును ఆమె కతడు జూపెను.

ఇట్లే సుమారు ఎనిమిదవ సంవత్సరప్రాయమున, జగన్నాథమునకు యాత్రార్థ మేగుచు గామారిపుష్కరిణిగల యొక సత్రమున విశ్రాంతిగొనుచుండు సన్న్యాసుల సేవజేయుచు, వారిసాంగత్యమును అనుభవించుచు, నాబాలు డొకనాడు శరీర మంతయు విభూతిని బూసికొని, కౌపీనమును ధరించి, తానిక ముందట్లు అగుదునని సూచించుటకో యనునట్లు జననివద్ద కరుదెంచి 'అమ్మా నేనెట్లు సాధువునైతినో గాంచితివా' అని పలికి తల్లికి భయాందోళనముల గల్గించెను. ఇట్లేగదా గోపాల కృష్ణుడు మన్ను తినునట్లు నటించి, తానే బ్రహ్మాండపాలకుడ నని జననికి దెలుపునిమిత్తము, తన యాననమున సకలప్రపంచ మును జూపెను. కాని యంతయు వీక్షించిన యశోద ఎట్లు పుత్రమమకారముచే నారహస్యముల గ్రహింపలేదో, అట్లే మన

చంద్రామణియు దన కుమారుని యథార్థతత్త్వమును గ్రహింప లేకుండెను. మమకార పూర్ణమగు మాతృప్రేమ అట్టిదిగదా!

కాలము దొర్లిపోవ మన గదాధరుడు దినదిన ప్రవర్ధ మానుడగుచు నా గ్రామవాసులందరికి ముద్దుబిడ్డడై తన రారెను. పాఠశాల కరుగునపుడు అట బోధింపబడు పాఠ ముల సారరహితములుగ నిశ్చయించి నిర్లక్ష్యము నా బాలుడు చేయుచుండును. ధారణశక్తి యెక్కువగ నుండుటచే వినిన దానిని తు, చ, తప్పక దిరిగి చెప్పగలిగి యుండును. అవును, ఈ చదువులు భగవంతుని జేర్పజాలవని నాడే నిశ్చయించె నేమో ఆ బాలుడు! అట్లుకాక 'బ్రహ్మవిద్యాం సర్వవిద్యా ప్రతిష్ఠాం' సర్వవిద్యామూలమగునది బ్రహ్మవిద్య అను ముండక శృతి వాక్యార్థసారమును గ్రోలుట కతన నీ ప్రాపంచిక విద్య లపై నతనికి యాసక్తి లోపించెనేమో! చదువుట నేర్చినతోడ మహాపురుషుల జీవితములు, పురాణములు, ఆధ్యాత్మికోన్నతికి మార్గము నెరింగించు నితర గ్రంథరాజముల నతడు పఠించుచు నానందించువాడు.

ఆ భావముల సమవయస్కులకు బోధించుచుండెడి వాడు. మరియు కేవలము ఆ గ్రంథముల జదువుటయేగాక చిత్రలేఖనమునను, సంగీతముననుగూడ బ్రవీణుడై యతడు రాణించెను. మన గదాధరుడు శిల్పకళయందు దారితేరినవాడు. గదాధరుడు విగ్రహముల నిర్మించుచో నవి సజీవముగ భాసిం చెడివనుట కొక తార్కాణము గలదు. దక్షిణేశ్వర దేవాలయ మున మన గదాధరుని జ్యేష్ఠసోదరుడగు రామకుమారు డర్చ కుడై యుండ నితడుగూడ నచ్చోటనే వసించుచు, గంగాతట

మున జపాదుల గావించుకొనుచు నుండువాడు. ఒకనాడు తా నర్చింప, జితేంద్రియుడును జ్ఞానస్వరూపుడును తపోనిమగ్నుడును అగు పరమశివుని విగ్రహమును దయారొనరించెను. దేవాలయాధికారియు భక్తుడును అగు మధురబాబు ఆ విగ్రహమూర్తిని గాంచి ఆశ్చర్యచకితుడై, గదాధరుని సన్నిహితుడైన హృదయరాముని యవిగ్రహమునకై యర్థించెను. సమ్మతించి గదాధర నామమునమన్న మన రామకృష్ణుడు దాని నతని కొసంగెను. ఈ శిల్పచాతుర్య ముగ్గుపాలతో గదాధరునకు లభ్యముగదా!

కామారిపుష్కరిణిలో ఖుదీరాముడు అనుదినమును రఘువీరార్చనము గావించుచుండ గాంచి అట్టి మహాభాగ్యమునకై గదాధరు డువ్విళ్ళూరుచుండెడివాడు. అట్టి యదృష్టమునకై నిరీక్షించుచుండెను. ఇట్లుండ గదాధరున కేడవయేట, సాలంపూరున దన మేనల్లుని యింట దేవీనవరాత్రములకై యేగిన ఖుదీరాముడు రోగగ్రస్థుడై శ్రీ రామచంద్ర నామస్మరణముతో 1843 వ సంవత్సరమున నసువుల బాసెను. ఈవార్త కామారిపుష్కరిణిగల గదాధరుని కర్ణపుటంబుల సోకగనే 'ఈ ప్రపంచము యింతియగదా! ఇది నశ్వరమును క్షణికమును అగుటచే నిక శాశ్వతమైన భగవంతుని బొందవలెను. ఈఅనిత్య సుఖములు ఎందులకు ?' అని మనంబున బరివరి విధముల నాలోచించెను. 'సర్వంవస్తు భయాన్వితం భువి నృణాంవైరాగ్యమేవాభయం' ప్రపంచమున మానవులకు సర్వవస్తుజాలమును భయాన్వితమై, ఒక్క వైరాగ్యముమాత్రమే అభయప్రదమై

యొప్పుచున్న దను భర్తృహరి వాక్యమువోలె గ్రమక్రమముగ ప్రపంచముపై విరాగము అతనికి మెండయ్యెను.

ఆశ్చర్యము ! ఏమది ? ప్రాపంచికవిషయముల రోసి, జనని నొప్పించి, గృహము బాసి, దేశముల దిరిగి, గురువు నన్వేషించి, సాధనాధ్యయనముల గావించి, అనుభవసంపదల మునిగి, ఉద్గ్రంథముల రచించి, అద్వైతమత ప్రతిపాదనము జేసిన జగద్గురువు ఆదిశంకరాచార్యులును, దన ఏడు ఎనిమిదవ వత్సర ప్రాయముననే సర్వమును నిర్ధారణమొనర్చుకొనెను. అట్లే 'వివాహమే సర్వ దుఃఖమూల మని ఎవరో వచింప, దాని గ్రహించి, 'ఏమి ? వివాహమే సర్వానర్థ దాయకమా ! అట్లయిన శ్రీ రామచంద్రు డేల పెండ్లియాడెను ? ఇట్టి వివాహమును నేను మాత్ర మంగీకరింపను. ఇదియే నా దృఢ నిశ్చయ'మని ప్రతిజ్ఞజేసి, తర్వాత శ్రీ రామకృష్ణ చరణాంబురుహముల నాశ్రయించి, యత్యాశ్రమమును గొని, పాశ్చాత్యమున సర్వమత మహాసభల ప్రాచీన భారతీయ విద్యాప్రాభవముల నెగ్గలెత్తి చాటి, వేదాంత కేసరియైన శ్రీ వివేకానంద స్వామియు దన ఏడు ఎన్మిదవ సంవత్సరముననే తన భావి కార్యక్రమమును నిశ్చయించి తీర్మానించెను. పై విధాన ప్రపంచోద్ధారకులు యీ ప్రపంచమున నుద్భవింపక బూర్వమే తాము లోకమున జేయవలసిన కార్యముల నిర్ణయించి యిట జనింతురుకాని మనముమాత్రము వారిని వెంటనే గ్రహింపజాలము అని అర్థము. డెబ్బదివత్సరముల ప్రాయమున, ఒక్క దినము గ్రామాంతరముననున్నచో గంటికి నిద్దురరాక మనస్సు గృహముదెస పర్వులెత్తు సామాన్యులకును, 'స్వాత్మావలోక

నార్థం తు తస్మాత్సర్వం పరిత్యజేత్' స్వాత్మావలోకనమునకై సర్వమును బరిత్యజింపవలయునను శాస్త్రోక్తిరీతి బాల్యముననే సర్వసంగముల సన్న్యసించిన మహాపురుషులకును నెంత తార తమ్యము గలదు! బాల్యమున నట్టి నిశ్చయము కలుగుట దుస్సాధ్యముగదా ! ఇట్టి వారు లోకమున జాల అరుదుగా నుందురు.

బాలునికి దొమ్మిదివర్షముల ప్రాయమున బ్రాహ్మణ వంశమున బ్రధానమగు ఉపనయన కార్యమును అతనికి జేయింప నన్నయగు రామకుమారుడు సంకల్పించెను. అందు ముఖ్యమగు భిక్షాస్వీకరణ సమయమున, తన పూర్వ వాగ్దా నమును స్మరించి, ప్రథమ భిక్షను కుమ్మరస్త్రీయగు ధని నుండి స్వీకరింప నతడు బట్టుపట్టెను. కాని శూద్రకులజనుండి భిక్ష గ్రహించుట ఆచారవిరుద్ధమని రామకుమారుడు అతనికి చెప్పిచూచెను. అయినను గదాధరు డందుల కంగీకరింపక, దన వాగ్దానభంగమున కియ్యకొనడయ్యెను. సోదరుడును అంగీకరింపక తప్పదయ్యెను. అంత దనకొరకు వేచియున్న ధన్య ధనిదగ్గర కేతెంచి, కుచేలునివద్ద కృష్ణుడు అటుకుల గ్రహించినచందము, గదాధరుడు ఆమెనుండి భిక్షగైకొని, ఆమె గృహమును, జీవితమును, ఆమెను బవిత్రము గావిం చెను. నాడు ఆచిన్న గదాధరునకు బ్రథమభిక్ష నిడి ఆనందిం చిన ధని ముమ్మాటికిని ధన్యయే. చిన్ననాటి యీ పట్టుదలయే కాలక్రమమున గదాధరులో నభివృద్ధిగాంచి సర్వదేవతలను స్వాధీనమొనరింప జేసికొని పరమహంసదేవునిగా బరిణమింప జేసినది.

## భక్తి తన్మయత్వము

ఉపనయనము నాటనుండి గదాధరుని యంతర్గత భక్తి కుసుమము రఘువీరార్చనా ఫలితముగ వికసింపదొడగెను. సంపూర్ణ భక్తితన్మయుడై యధికకాలమును శ్రీరామచంద్ర పూజాదులందు గడుపుచు, దదితర సమయములందు సామాన్య మానవులు చోర భీతావహము గలుగజేయు స్మశానవాటిక లందును, భయంకర వాతావరణముగల తోటలందును అతడు ఏకాంతముగ యోచనా నిమగ్నుడై సాధనాదుల నొనరించు చుండెడివాడు. వ్యర్థముగ గ్రంథముల జదువక నందలి విష యముల సాధన కుపయోగించుకొనెడివాడు. ఇట్లుండ శివరాత్రి యరుదెంచెను. నాడు ఉపవసించి, ఆ దినమంతయు శివధ్యాన తత్పరుడై, పరశివుని బ్రత్యక్షము గావించుకొన వలయునను దృఢసంకల్పమున గదాధరుడు జననితో, నాడు తనకు ఎట్టి విక్షేపము కలుగజేయవలదని యర్థించెను. అట్లు పగలంతయు నతడు జ్ఞానయోగీశ్వరుడగు పరమశివునిగూర్చి యుపాసించెను. పవిత్రమగు శివరాత్రి యగుటచే, నారాత్రి జాగరణమున కుప యుక్తముగా నొక నాటకబృందమువారు నాడా గ్రామమున శివలీల నాటకమును బ్రదర్శింప నరుదెంచిరి. ఈశ్వరపాత్రధారి యగువ్యక్తినాడుపవసించియుండుటచే నతనికిజ్వరమంకురించెను. ఆ పాత్రను నిర్వహింప నన్యులెవరును లేకుండుటచే నా నాటక సంఘమువారు యోచనాగ్రస్థులై యుండ, గొందరు గ్రామ స్థులు గదాధరు ప్రజ్ఞానైపుణ్యముల నెఱింగివారు గాన నాటకము వారికి ధైర్యముజెప్పి, శివపాత్ర ధారుని గొనిరా వాగ్దానము

జేసి గదాధరు నింటికేగిరి. అట శివసాక్షాత్కార నిరీక్షణా చిత్తమున దీవ్రధ్యానాయత్త చిత్తుడై యుండెను మన గదాధరుడు. కుమారుని సంకల్పము నెరింగిన చంద్రాదేవి ప్రథమమున గ్రామస్థులకోర్కె నిరాకరించి బాలుని గదల్ప బూనలేదు. కాని యధికసంఖ్యాక జనముల గోర్కెపై సుతుని మేల్కొలిపి విషయము నతనికి విశదపరచెను. గదాధరుండును తొలి సమ్మతింపని వాడయ్యెను, క్రమముగ నాటకబృందమువారి అసహాయ స్థితిని, గ్రామస్థుల ఆశాభంగమును గ్రహించి, శివ పాత్రధారణమున కంగీకరించి నాటకరంగమునకు వెడలెను. అచ్చట నస్త్రవాసిని రంగుల గదిలోనికి గొంపోయి నాటక బృందము పాత్రధారణమునకై అతని శరీరమునకు సంపూర్ణముగ విభూతియు, జటాజూటము, రుద్రాక్షమాలలు చంద్ర వంక మున్నగు శివాలంకరణముల నొక్కటొక్కటి మేన నమర్చుకొలది, బాలుడు, తానే శివుడనను దృఢభావము రాను రాను దృఢతరమై క్రమముగ బాహ్యస్మృతిని గోల్పోయెను. పగలంతయు నుపవసించియుండుటచే నత డట్లుండెనని బృందము దలంచి, గదాధరరూపమునగల శివుని ఎత్తుకొని రంగముపై నిలువజేసి తెర నెత్తిరి. కాని మన యీ ప్రపంచమున నుండక, ఆ బాలుని మనస్సు శివానందమున నీదులాడుచున్నదను రహస్యము వారికి దెలియకుండుటచే నాతనిచే బలికింపజేయుట కెన్నియో యుపాయముల గావించి, విఫలురై, అచేతనమువలెనున్న ఆ బాలుని భుజములపై నిల్పికొని గృహమున నతని జననికి నొప్పగించి వెడలిపోయిరి. ఆ స్థితిలో నున్న గదాధరుని గాంచి చంద్రామణి మిగుల భయాందోళన

ముల జెందెను. మరుసటి దినమునకు గదాధరునకు బాహ్య స్మృతి గలిగి యారోగ్యముగ నుండుటచే నాతల్లి సంతసించెను. దశవర్ష ప్రాయుడగు గదాధరుడేమి, సమాధుల బొందు టేమి! కాని యీ భావసమాధు లుగ్గుపాలతో నాతనికి అనుభవైక వేద్యములేగదా !

ఇట్లే పూర్వము యితనికి ఆరువత్సరముల ప్రాయమున, గ్రామ సమీపమునగల క్షేత్రముల ప్రక్కగ నతడు ఒక దినమున సాయంకాలము బోవుచుండెను. ఆ సమయమున, నల్లని కారుమేఘములు ఆకసమున లేచుటయు, వానిపై దెల్లని కొంగలబారొకటి ఎగురుటయు జరిగెను. ఆ వెంటనే నీలమేఘము శ్రీకృష్ణాకృతిని, ఆ శ్వేతవిహంగముల పంక్తి గోపాలుని కంఠమునగల ముత్యాల సరమువలె గోచరింప నతడు తన్మయుడై సమాధిమగ్నుడై యొప్పెను. మరియొక సారి, కామారిపుష్కరిణికి రెండుమైళ్ళ దూరమునగల ఆనూరు అను గ్రామమున గ్రామాధిదేవతయగు విశాలాక్షి నర్చించుటకు కొందరు స్త్రీలు వెడలుచుండ, వారితో మన గదాధరుడును దేవీకీర్తనల బాడుచు బ్రయాణమయ్యెను. అతనికి అప్పుడు ఎనిమిది వత్సరములు మాత్రమే. క్రమముగ, బాడుచున్న నాబాలుడు, ఆనందబాష్పములు చెక్కిళ్ళనుండి బ్రవహింప జైతన్యరహితుడయ్యెను. వెంటనే ఆ వనితామణులు గదాధరుని భక్తిశ్రద్ధల గ్రహించియున్నవారు గాన ఆతని ప్రక్కజేరి, సంకీర్తన గావింప గొంతతడవునకు ఆతనికి స్మృతి గలిగి విశాలాక్షిని దర్శించి అతడు తిరిగివచ్చెను. ఈ విధముగ సర్వ సమాధిస్థితులు జిన్ననాటనుండియే హస్తగతమగుట,

చేతనే తర్వాత తర్వాత నిర్వికల్పాదికముల నతడు బహు సులభముగా బొందగల్గెను. ఇట్టిది అందరికి సాధ్యము కాదు గదా!

## కలకత్తా వాసము

ఈ విధముగ కామారిపుష్కరిణిలో గదాధరుడు తన జీవితమును గడుపుచు ప్రాపంచిక సౌఖ్యములపై నిర్లక్ష్యతయు, సామాన్య విద్యయందు ననభిమానమును మొదలగు లక్షణ ములు గలిగి అభివృద్ధి గాంచుచుండెను. తండ్రి మరణానంతరము, సంసారనిర్వాహణ కార్యభారము జ్యేష్ఠుడైన రామకుమారునిపై నుండుటయు, గామారిపుష్కరిణియందు ఆర్జన కవకాశములు లేకుండుటచే రామకుమారుడు ధనార్జనకై కలకత్తాలో నివాస మేర్పరుచుకొని, అట నొక చిన్న సంస్కృత పాఠశాలను నిర్వ హించుచు, గొన్ని శ్రీమంతుల గృహముల దేవతార్చనల నొన రించుచు, కుటుంబపోషణము జరుపుచుండెను. కామారిపుష్క రిణిలో జదువులేక దిరుగుచుండు సోదరుని గదాధరునిగూడ గలకత్తకు దన వెంటగొంపోయి విద్యాభ్యాసము జేయింప రామకుమారునికి తలంపు గలిగి సుమారు షోడశవర్షప్రాయు డైన గదాధరుని గలకత్తకు గొంపోయెను. ఇక యిటనుండియే మన గదాధరు జీవితమున ముఖ్యమైన పరివర్తన లేర్పడి లోకో త్తర మహావ్యక్తియై వెలుగొందెను.

పల్లెటూరిలో జదువుల ముగించి, పట్నవాసమున ఉన్నత విద్యాభ్యాసమునకై ఏతెంచు బాలకుల గాంచుడు.

వారిలో గొలదికాలమునకే బరిణామము విస్పష్టముగ మనకు గానవచ్చును. అదెట్టి పరిణామము? పల్లెలయందు అచ్చటి నిర్మల మలయమారుతము కల్మషముల రూపుమాప, పవిత్ర భావజాలముల నలవరుచుకొనుచు, శ్రద్ధాళువులై విద్యల నభ్య సించుచు, దల్లిదండ్రులయెడ గౌరవాదరముల మెలగుచు, బరుల కష్టసుఖములకు దోడ్పడుచు నుందురుగదా వారు! అట్టివారు ప్రకృతి నిర్మిత ప్రదేశములుకాని పట్టణముల కరుదెంచి, దాని జూచి మురియుచు, బూర్వపు సద్గుణముల విస్మరించి, కృత్రిమ వాయువు నాఘ్రాణించుచు, అనవసర సంబంధముల గల్పించు కొని, కలుషిత వాతావరణమున దుర్గుణములకులోనై, దుష్ట జనుచు, స్వార్థము పెంపొంద, విద్యయందు శ్రద్ధాసక్తులు నశింప, నొక యంత్రముకై వడి గార్యముల నిర్వహించుటయే గాని జీవిత పురోభివృద్ధికారణమగు గమ్యమును నిర్దేశించుకొను టయు, అద్దానికై కృషిసల్పుటయు, వలయు సల్లక్షణముల నలవరచుకొనుటయు నెచ్చటను గానరాదు. ఇయ్యది విపరీతపు బరిణామమునకు దారి తీయుచుండెనేమో! పట్నవాసులై పూర్వపు సద్భావముల బోనాడుట పరిణామమా? నాగరికత యను నామమున బాశ్చాత్యుల ననుకరించి పూర్వాచారముల గూలద్రోయుట పరిణామమా? ప్రాచీన ఆర్ష సంస్కృతిని మూలకుద్రోసి, భౌతికవిజ్ఞానమే పరమావధి యని భావించుట పరిణామమా! మన మహర్షిచంద్రుల, అనుభవవేత్తల, యతి వరేణ్యుల, పుణ్యపురుషుల అనుభవ వాక్యసంచయమును బరిహ సించుచు, మన సంస్కృతినే చేగొని, దానినే తమ స్వంతముగ బలుకుచు మరల మన కందజేయు నితరుల నభినందించుట పరి

ణామమనూ? పరిణామమన నేమి? ఏది మన జీవితపు పురోభివృద్ధికి మూలమై, శాంత్యానందముల కాకరమై, నవచైతన్యము నొసంగునో అదియే పరిణామమన జెల్లునుగాని, తనకు బాధాకరమై, పరులకు దుఃఖ కారణమగునది పరిణామము కానేరదు. ఈ పరిణామమైనను ఉత్తమమై తనరవలెను. ఈ పరిణామము శారీరక, మానసిక, ఆధ్యాత్మికములని త్రివిధము. జన్మించినదాదిగా నీ శరీరము కాలానుగుణ్యముగ మార్పునొందుట శారీరక పరిణామము. అక్షరాభ్యాసమునాటినుండి పాండిత్యము సంపాదించుదనుక మానసిక లేక విద్యా పరిణామము. అట్టి లౌకిక విషయములుగాక దైవిక విషయముల నభివృద్ధినొందుట ఆధ్యాత్మిక పరిణామము. ఈ త్రయమున నాధ్యాత్మిక పరిణామమే ఉత్తమోత్తమమైనది. ఈ పరిణామమును బొందుటయే జీవిత పరమావధిని గాంచుట యగును. ఎచ్చోటనున్నను, ఏ పరిస్థితులనున్నను తన అభివృద్ధినిగూర్చియే చింతించుచు, దానికై తపించుచు, జిట్టచివరకు దన గమ్యమును పొందుటయేగదా మానవ లక్షణము! అందుచే మన గదాధరుడు పై వచింపబడిన పరిణామత్రయమున నుత్తమోత్తమమైన ఆధ్యాత్మిక పరిణామమునొంది, ప్రపంచమున కెట్టి తారణోపాయమును బ్రసాదించెనో యిక ముందు గ్రహించెదముగాక!

ఇట్లు కొంతకాలము జరుగ, గదాధరుని దృష్టి యింకను ప్రపంచముఁబ్రవేశింపక నశీతముగ నుండుటచే ననుజుడు గాంచి, ఒక దినమున 'సోదరా, విద్యలేక యిట్లు ఎంతకాలము మనగలవు? 'విద్యా విహీనః పశుః' విద్యావిహీనుడు పశువుగ బరిగణింపబడుట నీవు గ్రహింపవైతివిగదా' అని మెల్లన

దమ్ముని మందలింప, 'అన్నా! నీవు వచించినది సత్యమే. కాని యీ చదువు పొట్టకూటికిగాక భగవత్సాక్షాత్కారమున కుపయుక్తమగునా? అందుచేత నీ యశాశ్వత విద్యలకై నామనస్సు ప్రాకులాడజాలకున్నది. శాశ్వతమగు భగవంతుని జేర్చు విద్యకై నాహృదయ మారాట పడుచున్నది. అనిత్యములగు వీని కాతురత జెందనేల?' అని తీవ్ర భగవదావేదనా తప్త హృదయముతో గద్గదస్వరమున జవాబొసంగెను. తాను గీర్వాణభాషా కోవిదుడైనను, సకల శాస్త్రముల నభ్యసించిన వాడైనను, తాను గ్రహింపజాలని సత్యమును జిరుప్రాయమున గల తమ్ముడు తనకు బోధించుటకు, విశాలహృదయ సంపన్నుడగు రామకుమారుడు సంతసించి, ఒక్కమాటనైన బలుకక, ఆతని యిష్టానుసారముగనే ప్రవర్తించిన శ్రేయోదాయకముగ నుండునవి యూరకుండెను. తన యథార్థతత్త్వమును ఎట్టి జంకు గొంకులును లేక అన్నకు దెలియజెప్పిన గదాధరుడు స్వేచ్ఛగ భగవదన్వేషణాయత్త చిత్తుడై తనరొందెను.

కలకత్తకు జేరిన పిమ్మటనైన మన గదాధరుని దృక్పథమున రామకుమారుడు గోరిన నెవ్విధమైన పరిణామము గోచరింపకుండెను. తన కనిష్ఠసోదరుడు మిగుల గారాబముగా బెరుగుటచే నెట్టిగట్టిమాటనైన దా బలికిన నాతని మనస్సునకు నొప్పి కలుగునో యని మనమున భావించి, రామకుమారుడు తాను ప్రతిదినము జేయుచుండిన దేవతార్చనాది కార్యముల జేయ దమ్మునికి మెల్లగజెప్పి సమ్మతింపజేసెను. గదాధరుడును మనంబున నమందానంద భరితుడై యన్నగారి యాజ్ఞాబద్ధుడై శ్రీమంతుల యిండ్ల కడు భక్తియుక్తుడై, తన్మయుడై

వారివారి యిష్టదైవముల బూజించుకాలమున భగవంతుని యందు లగ్నచిత్తుడై మెలగుచుండెను. ఈ బాలుని అర్చనా విధానమునకు నా గేస్థులు ఆశ్చర్య సంభ్రమముల దమ వ్యవహారముల మరచి తమ యిష్టదైవములందే దృష్టినుంచి తన్మయులగుచుండిరి. అవును, పూజ యనిన నదియేగదా! ఏకాగ్రతను సాధించుటకై మన వేదమాత ఉపాసనమును ప్రథమ సోపానముగా నిర్దేశించెను. చిత్తలగ్నతకు నొకమూర్తిని ప్రథమమున నిడికొనిన నంత ఆమూర్తి వైదొలగినను నా ఏకాగ్రతకు భంగము వాటిల్లదు. కాన 'ఆదౌ సగుణ మాశ్రిత్య నిర్గుణం చ తతః పరం' అనియె శృత్యాదేశము. అందుచే ముందు మూర్తిని గ్రహించి ధ్యానించుట భక్తియనియు, నటుపై మూర్తిరహితముగ ధ్యానించుట జ్ఞానమనియు దాత్పర్యము. అర్చకు డట్టి చిత్తైకాగ్రతతో నర్చనాదుల సలుపుచుండ వాని ఆ భావజాలము లితరులగూడ నావరించుటయం దాశ్చర్యమేమి? అట్లు గానిచో బరుల భావములు వారి ఏకాగ్రతకు భంగము కలిగించునుగదా! అట్టి విధమున భంగము కలుగుటయు, దాని సవరించుటయు జరిగిన సంఘటన మొండు మన గదాధరుని జీవితమున గోచరము. రాణీరాస్మణీ నిర్మిత దక్షిణేశ్వర దేవాలయమున గదాధరుడు ఒకనాడు భవతరణీ కాళికా దేవిని బూజించుచు, నామెయందే మనస్సును లగ్నమొనర్చి యుండుసమయమున, దేవాలయాధికారిణియు, జగన్మాత భక్తురాలును అగు రాణీరాస్మణి తన సేవకులతో దేవీ దర్శనార్థ మరుదెంచెను. కాని గదాధరుడు భక్తి తన్మయత బూజాదుల నొనర్చుచు ఆమె రాకనే గమనింపడయ్యెను.

ఆమెయు నొకచో నాసీనయై భక్తిపరవశత నర్చనాదుల వీక్షించుచుండెను. ఇంతలో నా ఏకాగ్రతకు విఘ్నము వాటిల్లు నొక వ్యాజ్యవిషయమగు భావన నామె మనమున నుదయింప దానినిగూర్చి చింతించుచుండెను. ఈ భావముచే గదాధరుని ఏకాగ్రత భగ్నమై, అత డామె దెస బరికించి 'ఇచ్చటను యీ యపవిత్ర భావములేల?' యనుచు నామె చెంపపై చెళ్ళున గొట్టెను. అంత జెంతనేయున్న ఆమె పరిచారకు లదిగాంచి గదాధరుపై గలియబడనుంకించు సమయమున, సూక్ష్మ బుద్ధియు, దన దోషమును గుర్తెరింగిన రాణి వారిని వారించి, 'ఇట్లేల అగౌరవముగ బ్రవర్తించెదరు? తప్పుచేసినవారి శిక్షించుట యుక్తమే. బిడ్డ లోపముల దండ్రిగాక ఒరులెవరు సరి జేయగలరు? ఇంక నెప్పుడిట్టి కార్యముల జేయవలదని నాతల్లి యీ దేశమిది'యని బలుకుచు వినమ్రయై బుత్రికవోలె గదాధరునికి సాష్టాంగ మొనర్చినది. పై దృష్టాంతమును గాంచిన భగవంతుడుగాక సన్యమంతయు నా మహాపురుషులకు వ్యర్థముగ దోచును. అట్టి తీవ్రవిధాన నేకాగ్రత సాధించుటచేతనే తర్వాత నాతడు యతికులావతంసుడై యొప్పారెను.

## దక్షిణేశ్వరాలయము

కలకత్తా ప్రవేశమునుండి గదాధరుడు శ్రీ రామకృష్ణుడని ప్రఖ్యాతుడగుటచే నిక నతని శ్రీ రామకృష్ణుడనియే వచించెదముగాక. ఇట్లు శ్రీ రామకృష్ణుడు రామకుమారునితో గలకత్తానగరమున వాసంబుండుకాలమున, నతని భవిష్యజ్జీవిత

నాటకమున ప్రముఖపాత్ర ధరించిన జమీందారిణియు దయార్ద్రహృదయయు, జగన్మాత భక్తురాలును అగు రాణీరాస్మణి యను వనితారత్నము కలకత్తలో నుండెను. ఆమె జాతియందు పల్లెస్త్రీయైనను సద్గుణములందుమాత్రము కొరవడినదికాదు. ఇట్టి భక్తురాలు, తన యల్లుడును భక్తుడును అగు మథురనాథునికి జమీను నొప్పగించి, భక్తుల కాకరమును, యాత్రికుల యఘపుంజముల దన పవిత్రతచే బారద్రోలి ముక్తిబొంద నర్హతప్రసాదించి విశ్వనాథ దర్శనమునకై బంపుచున్నదో యనునట్లుండు పావన గంగానదీ తీరమునగల వారణాశిని దర్శింప ప్రయాణమయ్యెను. లక్షాధికారిణి గాన ననేకమగు పడవలలో నామె ప్రయాణము గంగపై సాగించుచు, బగలంతయు వస్తుసామగ్రిని సద్దుకొనుటకై వినియోగించియుండుటచే నలసి, గంగానదీ మందమారుతములు చల్లగ వీచుచుండ నించుక గనుమూసెను. అంత నామెకు ఒక దృశ్యము గోచరించెను. అందు తన యిష్టదైవమైన కాళికామూర్తి సాక్షాత్కరించి 'నీవు కాశికి బోనేల? ఇచట నాకొక ఆలయమును నిర్మించి నన్నందు ప్రతిష్ఠింపుము. అచ్చట నేను భక్తుల పాలిట గల్పతరువునై నివసించెదను. లెమ్ము' అని హెచ్చరించెను. ఆమెయు దిగ్గున లేచి, పడవల నట నాపు చేయించి, ఆస్థలము కలకత్త కెంతదూరమున గలదని విచారించి, పండితుల రావించి, ఆప్రదేశమును బరిశీలింప జేసెను. ఆప్రదేశము దేవీప్రతిష్ఠకు అనుకూలమైనదిగా నా బండితవర్గము తెలుప నామెయు మిగుల సంతసించి, కాశీయాత్రను విరమించి, కలకత్తకు దిరిగివచ్చి, ఆలయ నిర్మాణమునకై యిరువది ఎకర

ముల స్థలము 1847 వ సంవత్సరమున గొని, అందు నిర్మాణ మును శిల్పాచార్యుల రప్పించి పవిత్ర గంగానదీ తీరమున ప్రారంభించెను. ధన మధికముగ వ్యయపరచి ఆలయమును మిగుల సుందరముగ నామె నిర్మింపజేసెను. ఆలయనిర్మాణము పూర్తియయిన పిమ్మట, ప్రతిష్ఠా ముహూర్తమును ఏర్పాటు గావించి, ప్రతిష్ఠా కార్యకలాపమును నిర్వహింప నామె పండితుల నాహ్వానింప, నామె శూద్రస్త్రీ యను నెపమున వారు నిరాకరించిరి. దాని కామె వగచి, దేవిని ప్రార్థించుచు మార్గ మునకై యోచించుచుండ రామకుమారుని పాండిత్యమును, విశాలతత్త్వమునుగూర్చి యాలకించి ఆమె అతనికి ఆహ్వాన మంపెను. రామకుమారుడు జమీందారిణియొక్క వర్ణాదిక మునుగాక హృదయమునకు ప్రాధాన్యతనొసంగి, ప్రతిష్ఠా ముహూర్తమును నిర్ణయించి, 1855 వ సంవత్సరము మే నెల 31 వ తేదీన నారమణీయ దేవాలయమున లోకోపకారిణియు, భవతరణియు నగు కాళికామూర్తిని ప్రతిష్ఠాపనము గావించెను. కేవల మాచారపరులైయొప్పు పండితులుమాత్రము దీనికి సమ్మ తింపకపోయినను అనేక పండితలోకము సంతసించెను. ఏదెట్లు న్నను, చేతనమూర్తియై దివ్యశోభతో దేవిమాత్రము ప్రకా శింప దొడంగెను. అంతటి ధనవ్యయమున గట్టబడిన ఆ దేవా లయ మెంత గొప్పదియో చదువరులే యోచించి నిర్ణయించు కొందురు గాక !

మొత్తమునకు రాస్మణి తొమ్మిదిలక్షలరూప్యముల వ్యయ మొనరించెనట ! ధనసంపత్తి కలుగుటయు బూర్వజన్మ సుకృతమే. కాని అంతమాత్రముచే సర్వము సుసాధ్యముకాదు.

దానికిని సక్రమోపయోగమును శాస్త్రము నిర్దేశించినది. ధనమునకు దాన, భోగ, నాశములని త్రివిధగతులు గలవనియు, నందు దాన, భోగములులేని సంపదకు మూడవదగు నాశము తప్పదని భర్తృహరి వచనము. తా ననుభవింపక, బయల కిడక దారిద్ర్యత నుండుచు, మమకారముచే వ్యయమొనర్పక యుండుట ప్రపంచమున విస్పష్టము. కాని ధనముచే ముక్తిని బడసినట్లు శాస్త్రమున గానరాదు. అందుచే నేకొలదిమంది అదృష్టవంతుల ధనమో దేవాలయములకు, సత్పురుషుల సేవా భాగ్యముల కుపయోగింపబడి వారు ధన్యులయ్యెదరు. అట్లు రాణీరాస్మణి వ్యయ ప్రయాసలకోర్చి గంగా తీరమున రమ్యమగు దేవాలయమును నిర్మింప, ఆమె జామాతయగు మధుర బాబు అవతారవరేణ్యుడు సాధనావతారమగు శ్రీరామకృష్ణుని, రాజ్యపాలనా సమర్థులును ధీరోదాత్తులునగు నా గురువరేణ్యుని యువక శిష్యరత్నముల సేవాతత్పరుడై వారికి సర్వవసతుల నేర్పరచెను. ఆ యత్తయల్లుండ్ర త్యాగమే త్యాగము. అది సర్వాదర్శము, ఆచంద్రార్కము! ప్రతిష్ఠానంతరము దేవికి నిత్యనివేదనాదు లొనరింప నెవ్వరును ముందుకు రాకుండుటచే మరల రాణియొక్క ప్రార్థనల మన్నించి, రామకుమారుడే ఏతత్కార్యమునకు బూని అర్చకు డేర్పడునంతవరకు అర్చన సాగింప నంగీకరించెను.

## అర్చనము

శ్రీరామకృష్ణుడు ప్రతిష్ఠా ఉత్సవముల వీక్షించుటకు గలకత్తనుండి దక్షిణేశ్వరమున కరుదెంచి, ఆనందమున నందు

పాల్గొని కలకత్తకు తిరిగి వెడలెను. కాని సోదరుడు దక్షిణే శ్వరమునుండి తిరిగి రాకుండుటచే మన రామకృష్ణుడు దక్షిణే శ్వరమున కేగ, రామకుమారుడు సర్వమును దెలియ జెప్పి, మన రామకృష్ణునికూడ ఆలయమున నివసింపగోరెను. కాని ప్రథమతః శ్రీ రామకృష్ణుడుగూడ శూద్రధనమును స్వీకరింప నొల్లక, ఆలయ ప్రసాదమును భుజింపక, స్వయముగా గంగా తీరమున, నాపవిత్ర తోయముల వంట గావించుకొనుచు, సాధనను దీవ్రముగ నొనర్చుచుండెను. అధిక భక్తిశ్రద్ధలుగల మన రామకృష్ణునిగాంచి, ఆలయాధికారియగు మధురనాథుడు, మిక్కిలి సంతసించి, దక్షిణేశ్వరీ కాళికార్చనము సేయ నాతని మిగుల యర్థించెను. కాని స్వతంత్ర జీవియగు శ్రీ రామ కృష్ణుడు సమ్మతింపక, దన తీవ్రసాధనల మునింగియుండెను. ప్రప్రథమమున సాధకుడు నియమముల తు, చ, తప్పక నను సరింపవలయుననియు, బిదప నియమముల నతిక్రమింపవలయుననియు, అనగా నవ్యక్తముగనే నియమాతీత స్థితి కరుగవలయునని, సర్వసాధకలోకమునకు బోధించుటకో యనునట్లు, మన రామ కృష్ణుడు అర్చకత్వమునేగాక, ఆలయ ప్రసాదమునుగూడ స్వీక రింప నిరాకరించెను. తా మాచరించియే గదా యితరులకు బోధించుట !

పై రీతిగ దక్షిణేశ్వరమున నిస్సంగుడై, తపోనియతుడై వసించుచు దనకు దోడుగ హృదయరాము డుండ జీవితపరమా వధికై యతడు యత్నించుచుండెను. ఇట్లుండ నొకనాడు, మధుర బాబు శ్రీ రామకృష్ణుని గాంచి వినమ్రుడై దేవీయర్చనము గావింప నర్థించెను. దేవి యాభరణముల సంరక్షణకు వేరొక

రున్నచో దా పూజాదుల సల్ప సమ్మతించెదనని శ్రీ రామకృష్ణుడు వచించెను. హృదయు డాబాధ్యత వహింప సమ్మతించెను. అంత మధురనాథుని హృదయసాగరమున నానంద తరంగములకు మేరలేలేవు. ఇన్నిదినములనుండి దేవీసన్నిధానమున శ్రీ రామకృష్ణు నర్చన కుంపవలయునను యత్నము నాడు దేవీ యనుగ్రహముచే సఫలమైనదని విశ్వసించి, అమితానందము నొందెను. విరాగయుక్తుడగు మన రామకృష్ణుడు దేవిని ఆభరణములచే నలంకరించుచుండ హృదయరాముడు పిమ్మట వాని జాగ్రత్తపరచుచు, రామకృష్ణుని చిత్తమును నిశ్చింతగ దపము నందు మగ్నతనొంద నవకాశ మొసంగెను. ఆలయనిర్మాత యగు రాస్మణియు నధికారియగు మధురుడును అవ్యాజముగ మన రామకృష్ణునందు భక్తిప్రపన్నులై శ్రీ రామకృష్ణుని అర్చకత్వమున దేవి సంతుష్ట యగుననియు, అతని యలంకారములతో నద్దేవి సజీవకళలతో నొప్పారుచుండు ననియు విశ్వసించిరి. అవును, భవిష్యత్తున పావనమూర్తియు, ప్రేమ స్వరూపుడును, త్యాగధనుడును, అగు మన రామకృష్ణునికి దమ ధన మాన ప్రాణముల నర్పించి ధన్యత బొందు ఆరాస్మణీ మధురులు నాడు రామకృష్ణుని యర్చనకై యర్థించుట ఉచితమేగదా !

ఇట్లుండ, ఆలయ ప్రాంగణమునగల రాధాకృష్ణ మందిరమున నర్చకుడైన క్షేత్రనాథుడు, శ్రీ కృష్ణమూర్తిని బడకగదికి గొంపోవుచు గాలుజారి నేల పడెను. అతని చేత నున్న శ్రీ కృష్ణమూర్తియొక్క కాలు విరిగెను. దానిచే గుటుంబమున కెట్టి ముప్పు వాటిల్లునో యని రాస్మణీ మధురులు

ఆందోళనము నెంది, పండితుల విచారింప, విరిగిన విగ్రహము అర్చనకు త్యాజ్యమనియు, దాని గంగానదిలో వేసి, ఆస్థానమున నూత్నవిగ్రహమును బ్రతిష్ఠింపవలయుననియు జెప్పిరి. క్రొత్తవిగ్రహ నిర్మాణమునకు ఆజ్ఞ నిడెనే గాని పూర్వవిగ్రహమును గంగ కర్పింప రాణికి మనసొప్పక, బాధ జెంద జొచ్చెను. ఇంతలో నామె మనోవీధికి మెరపువలె రామకృష్ణుడు తోచ, మధురుని బిలిచి, 'ఈ విషయమున శ్రీరామకృష్ణు డెట్లు వచించిన నట్లొనరింతము. ఈ విషయమును అతడే తీర్మానింపగలడు' అని వచింప, మధురుడు శ్రీ రామకృష్ణుని యీ విషయమున సలహా నర్థించెను ప్రపంచమునే మరచి, 'ఎప్పుడు భగవద్దర్శన ప్రాప్తియగునా ?' యని వర్షమునకై నిరీక్షించు చాతకమువలె వేచియున్న శ్రీరామకృష్ణుడు సర్వము నాలకించి, 'విగ్రహముయొక్క కాలు విరిగినదని నూతన విగ్రహమును బ్రతిష్ఠించుటయా ? రాణి యల్లుని కాలు విరిగిన మరొకని స్వీకరించుటగాక చికిత్స గావింతురుగదా ? అట్లే ఆ విగ్రహమునకు గాలు నతికించి పూజ గావింపుడు' అని హృదయముతో నార్తితో మన రామకృష్ణుడు వచించెను. అంత రాస్మణి సంతసించి, దాని సరిజేయు భారమునుగూడ శిల్పాచార్యుడైన మన రామకృష్ణునందే నుంప, నతడు ఆ విగ్రహమునకు విరిగిన కాలును తగిలించి సరిజేయ, ఎవరును విరిగినచోటును గానజాలరైరి. మన రామకృష్ణు డెంతటి శిల్పచాతుర్యము గలవాడోగదా ! అవును, విచ్ఛిన్నమైన జీవఖండమును పరమాత్మతో నభిన్నముగ నేకమొనరింప ప్రజ్ఞగలవాడు యిట్టి అచేతనముల సంయోగ మొందించుటయం దాశ్చర్య

మేమి ? నాటనుండి ఆరాధాకాంత ఆలయ అర్చకుడైన క్షేత్ర నాథుని దొలగించి, మన రామకృష్ణుని అర్చకునిగ మధుర బాబు నియమించెను.

నాటనుండి రాధాగోవిందాలయమున నర్చకుడై యన్య కార్యముల నతడు మరచి, భక్తితన్మయత్వమున జక్కగ నా దేవుని యలంకరించి గంటలకొలది బూజగావించెడివాడు. ఒక్కొక్కతరి, నిశ్చలుడై గంటలపర్యంతము శ్రీకృష్ణసన్నిధాన మున నట్లే కూరుచుండువాడు. పూజాసమయమున దదేక చిత్తుడై యర్చించుచుండువాడు. రామకుమారుడు యోచించి మన రామకృష్ణునికి కేనారాంభట్టాచారియను నొక శాక్తే యునివద్ద శక్తిమంత్రము నుపదేశింపజేసి, కాళికాపూజ గావింప మన రామకృష్ణుని గోరెను. కాళికా సన్నిధానమున పూజ గావించి జపించు మహదవకాశము లభించుట కానందించి, రామకృష్ణు డా దేవి నెవ్విధమున గొల్చి, విలపించి, ఆమె దర్శనభాగ్యము నొందెనో మున్నగు రహస్యముల గ్రహించె దముగాక !

## కాళీ దర్శనము

ఇప్పటినుండియే మన రామకృష్ణుని జీవిత గ్రంథమున నొక నూతనాధ్యాయము ప్రారంభము. తమ్మునికి తన యర్చనా బాధ్యతను నొప్పగించిన రామకుమారుడు, విశ్రాంతి నపేక్షించి, కామారిపుష్కరిణికి బో సంకల్పించి, మార్గమధ్యమున నకస్మాత్తుగ మరణించెను. రామకుమారుని

మరణము ఖుదీరాముని మరణమువలె రామకృష్ణుని గలచి వైచెను. 'ఆయుర్వ్యప్యగ్నిసంతప్త లోహస్థ జలబిందువత్' ఆయువైనను అగ్నిసంతప్త పాత్రయందలి జలకణమువోలె క్షణికమైనదనియు, అట్లు ఒక్క ఆయువుమాత్రమే కాక 'దేహేంద్రియ ప్రాణ మనోఽహ మాదయః సర్వే వికారా విషయా స్సుఖాదయః। వ్యోమాది భూతాన్యఖిలం చ విశ్వ మవ్యక్తపర్యంతమిదం హ్యనాత్మా॥' దేహేంద్రియ ప్రాణ మనో హంకారాదులును, వికారములగు సర్వ విషయ సుఖములును, వ్యోమాది పంచభూతములును, అవ్యక్త పర్యంతమగు నీ సకల విశ్వమును అనాత్మయే. అనగా ఆత్మవ్యతిరిక్త సమస్తము అనిత్యమని శాస్త్రవాక్యము. కాన ప్రాపంచిక సౌఖ్యములు చంచలమనియు, వాని నన్వేషించుట వ్యర్థమనియు, నీ జనన మరణ పరంపరనుండి బయల్పడు విధానము నెరుగుటయే ముఖ్యమనియు, 'విహాయ కామాన్ యః సర్వాన్ పుమాం శ్చరతి నిస్పృహః।నిర్మమో నిరహంకారః సశాంతి మధిగచ్ఛతి॥' ఎవడు సర్వకోర్కెలను వర్జించి, నిస్పృహుడై, నిర్మముడై, నిరహంకారుడై యుండునో వాడు శాంతిని బొందగలడు అను గీతావచనము ననుసరించి, శాంతికాముడగుటచే ప్రపంచవిషయ ములపై నసహ్యత అతనికి బెంపొందెను. ఈ ప్రాపంచికసుఖ ములు 'తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే' కర్మచే జేయబడిన ఫలితము లెట్లు యీ లోకమున నశించుచున్నవో, అట్లే పుణ్యకృత ఫలములు గూడ బరలోకమున క్షీణించును అను ఛాందోగ్యశ్రుతి చందమున నశించునని భావించి, 'సంగం త్యక్త్వా సుఖం

ప్రవజేత్' సంగమును ద్యజించి ఆనందమును బొందవలయు నను నట్లు సంతృప్తహృదయుడై మన రామకృష్ణుడు కాళికాదేవిని జననిగ సంబోధించుచు, ఆమెయందుగల భయంకరత్వమును గాంచక అర్చనము సేయగడంగెను.

అనుదినము బూలగోయుచు, వానిచే జగజ్జనని కాళిక నలంకరించుచు, దన్మయత బూజ నతడు గావించుచుండెను. క్రమక్రమముగ నతని దేవీ సందర్శనాకాంక్ష యధికమై హృదయము అగ్నిచందము తపింప నిద్రాహారముల వర్జించి, యహర్నిశములు దేవీ చింతన, అర్చనలందే కాలము గడుపుచు, నార్తి దుఃఖము సమ్మిళితమై బాధించుటచే తీవ్ర సంతప్తహృదయుడై, యొక్కొక్క దినమున 'అమ్మా, నీవు ప్రేమ స్వరూపిణివి కావా? 'యాదేవీ సర్వభూతేషు ప్రేమ రూపేణ సంస్థితా' సర్వభూతకోటియందు నీవు ప్రేమరూపమున నుంటివనిగదా గ్రంథము లనేకములు వచించుట? అమ్మా, సకలసృష్టిని జనింపజేసినది నీవేయైనచో నీవు చేతన మవుగదా, కాని యిట శిలారూపమున నుందువా?' అని యామూర్తిని సంబోధించుచు, నున్మత్తునివోలె నతడు ప్రలాపించును. దేవీ సమీపమునకేగి ఆమె నాసికాగ్రమున తన ప్రేలినిడి ఆమెయొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసముల బరీక్షించి, సంతసించి, 'అమ్మా, నీవు నాకేల గోచరింపవు? క్షణికములును, తుచ్ఛములును అగు యిహసుఖములకై నేను ప్రాకులాడుటలేదే? అవి నాకు వలదే? అమ్మా, నీదర్శనభాగ్యముచే, నీ చిరునవ్వులొల్కు వదనారవిందము నొకసారిగాంచి

ఆనందింతునే ? అన్యమేమియు నాకు వలదమ్మా! జనన మరణ దుఃఖప్రవాహమున మునుగువారికి ముక్తిప్రదాయినివి నీవై యుండ నీవుగాక నాకింకేది కావలయును ? నీవింకను జాగుచేసినచో దినములు దొర్లుకొలదిని మృత్యువు సమీపించి, నాతనువును కబళించును గదా ? ఆమృత్యువు నాపై దయ దలంచునా ? కాన నోఅమ్మా, నేను మృత్యువాత బడక మున్నే నీదివ్యదర్శనభాగ్యమును యీ నీ పుత్రునికి ప్రసాదింపుము. నీవు భక్తులపాలిటి గల్పవృక్షమను మాటలు వమ్మౌనా? లేక నాపిలుపు నీకందుటలేదా ? అమ్మా! ఒక్కసారి నాకు నీదర్శన మొసంగినగాని నేనిక మనజాలను. నిన్ను విడనాడి యింకెన్ని దినములిట్లు జీవచ్ఛవమువలె నే జీవించుట ? దుర్భరము! నీదర్శనమే నాకు ధన్యత్వము నొసంగును. తల్లీ, భవతరణీ, మోక్షప్రదాయినీ, ప్రేమస్వరూపిణీ, పుత్రుడనే దర్శనమీవే. నీవియోగము నిక నే భరింపజాలను' అని దుఃఖాక్రాంతుడై తల్లిని బాసిన శిశువుచందము ఆక్రందనము జేయుచు, మార్గాంతరము గోచరింపక, దక్షిణేశ్వరీ సాక్షాత్కారము నొందని తన జీవితము నంత మొందింప నిశ్చయించెను. అట్టి యసమానమును, విషాదమును గల సమయమున, మన రామకృష్ణుని దృష్టి, దేవీహస్తమునగల నిశిత ఖడ్గముపై బ్రసరింప, దక్షణమే యద్దాని నతడు గ్రహించి యాత్మహత్యకే సంసిద్ధమయ్యెను. తనకొరకు సర్వమును ద్రోసిపుచ్చి, తననే పరమ గమ్యముగా నెంచి, తన దివ్య దర్శన మహాభాగ్యమునకు దపించుచున్న యాభక్తవరేణ్యుని, యామహానుభావుని, తన ప్రేమైకపుత్రుని ప్రేమస్వరూపిణి

యగు విశ్వేశ్వరి చూచుచు నూరకుండగలదా! మందహాస చంద్రికలల్లన ముఖమున జిందులుద్రొక్క, నాయమృత కిరణ సందోహమును ఆ బిడ్డనిపై వెదజల్లుచు, నత్యంత మనోహర తేజోరూపమున నా త్రిలోకజనని మన రామకృష్ణునికి బ్రత్యక్ష మయ్యెను. తక్షణము శ్రీ రామకృష్ణునకు బాహ్యాస్మృతి వోవ ఆదివ్యానంద నిమగ్నచిత్తమున నతడు లీనమై కొంతకాల ముండెను. తా మున్నెన్న డెరుంగని అవ్యయానందమును బొంది ఆయమ్మను 'అమ్మా'యనుచు సంబోధించుచు నతడు కన్నుల దెరచెను.

నాటనుండి మన రామకృష్ణుని చిత్తప్రవృత్తులయందు గొప్ప పరివర్తన యేర్పడెను. ఆ దివ్యదర్శన మాధుర్యము నొక పర్యాయము రుచిజూచి యుండుటచే, దానితో దృప్తి గాంచక నాతని యపూర్వహృదయ మెల్లవేళల దేవీ సాక్షాత్కారవిభూతికై, దేవీసాన్నిధ్య మహాభాగ్యమునకై తపించుచు నధికతర సాధనలయందు నిమగ్నమయ్యెను. తత్ఫలితమున, బూజాకాలమున దన్మయుడై పూజాపాత్రలలో ద్రవ్యములు పూర్తియైనను గమనించుకొనలేని పరాయత్త చిత్తమున నట్లే అతడు హస్తమును ద్రిప్పుచుండును. ఒక్కొక్క పర్యాయము ఆ పుష్పాదులచే దననే పూజ గావించుకొని యనంతరము దేవిని యర్చించును. దేవికి నివేదన గావింప భోజ్యములదెచ్చి 'అమ్మా వీని నారగింపుము. అవును, బిడ్డ భుజింపనిదే తల్లి ఎట్లు భుజింపగలదు!' అని పరాభక్తి తన్మయత నతడే నా నివేదనా భాగమును గొంత భుజించి పిమ్మట దేవికి యర్పించును. మరియు, అమ్మవారిని నిద్రబుచ్చుటకై

ఆమె మూర్తిని శయ్యపై బరుండబెట్టి కీర్తనల బాడుచు, 'అమ్మా, నిదుర రాకున్నదా? శిశువైన నన్నుగూడ నీప్రక్కనే పరుండమని నీ యభీష్టమా?' అని యతడుగూడ దేవితో బవళించును. భయంకరాకృతిగల ఆకాళికామూర్తిలో భయమును దీసివైచి, 'అమ్మా! అమ్మా!' యనుచు మాతృ ఉపాసన మహిమచే జనవున నామె సన్నిధి నతడు మెలంగి, ఆయుపాసనయందు సిద్ధిని గాంచెను. 'యస్య యాదృశీ భావనా తస్య తాదృశీ సిద్ధిః' అనియు, 'యం భావం దర్శయే ద్యస్య తం భావం స తు పశ్యతి' అనియు ననంఖ్యాక శ్రుతి స్మృతి వచనములుగదా! ఆయుపాసనా ఫలితముగ నామాతృ భావముచే లోకమాతయగు కాళీమాయినే గాక, సర్వ నారీ మణులగూడ 'విద్యాస్సమస్తా స్తవదేవి భేదాః స్త్రియస్సమస్తాః సకలాజగత్సు త్వయైకయా పూరితమంబ ఏతత్'యీ ప్రపంచమునగల సకలవిద్యలును, అఖిల స్త్రీసమూహమును, నీయంశములే. నీచేతనే యీ నిఖిలము సంపూర్ణమైయున్నది అను తంత్రమురీతి సర్వమునందు నా మాతృరూప దర్శనమునే గాంచుచు మన రామకృష్ణుడు ఆనందింప దొడంగెను.

సర్వమును మాతృభావమున దిలకించు వాని నెట్టి కల్మషము జేరదుగదా! అదియేగదా పరమపవిత్రత! ఆపవిత్రతయే ఆధ్యాత్మికానందోపరిభాగముల బొందించునది! అట్టి పవిత్రతను నూతగాగొని'న గామ ధమ్మో నో నిగమస్సధమ్మో, న చాపియం ఏక కులస్స ధమ్మో। సబ్బ లోకస్స సదేవ కస్స ఏసేవధమ్మో యదిదం అనిచ్చతాతి॥' సకల వస్తువులు అనిత్యములు. ఈ యనిత్యములు రొుక గ్రామము, నగరము వంశ

మునకేగాక సర్వమానవులు దేవతలకు గూడ అన్వయించును అని బుద్ధభగవానుడు వచించినట్లు, సకలమును అనిత్యముగా దృఢభావముచే ప్రపంచము నేవగించి, ఒక్క పరమేశ్వరియే శాశ్వతానంద ధామమని విశ్వసించి, బాహ్యప్రపంచమున దృష్టిగాంచక, ఒకసారి ఆమె ప్రత్యక్షమైనను సంతుష్టినొందక, ననవరత మాదేవి సన్నిధాన ప్రాప్త మకరందాస్వాదనాబుద్ధి కాలమును మరచి, రాత్రింబవళ్ళు మన రామకృష్ణుడు సాధనా నిమగ్నత మరలనొందెను. ఆనిర్మల భక్తికి ఆనిష్కల్మషఆర్తికి ఆపవిత్ర ప్రేమకు, ఆసంపూర్ణ త్యాగమునకు నాలోకేశ్వరి ముదమంది, యిక నాలస్యము గావించిన అతని తను వకారణముగ మృత్యువాతబడుననియు, దాని సహాయమున నతడు లోకమున జేయవలసిన ఘనకార్యములు చాల గలవనియు, ముముక్షువుల కాదర్శమగు నీవిశాలవృక్షమును, సంసారాగ్ని తప్తులగు నసంఖ్యాక మానవకోటి విశ్రాంతికై యాశ్రయింతురనియు, నా మాతృస్వరూపిణి మదినెంచి, మాతృప్రేమ విలసితమైన చూడ్కులతో, మృదుమధుర వచనములతో దన భక్తునికి, తన పుత్రునికి ప్రత్యక్షమై, 'అమ్మా' యని అతడు పిలిచినంతనే 'ఓ' యని బలుకుచు, నతని సర్వ బాధ్యతల వహించి ఆనందమును జేకూర్చెను. 'తల్లీ, నేను యంత్రమును. నీవు దానిని త్రిప్పు యంత్రిణివి. యంత్రమునకు గుణదోషములులేవుగదా! అట్లే నాకును దోషములంటవు. నీవెట్లు నడిపిన నేనట్లు మెలగుదును' అనుభావన శ్రీ రామకృష్ణు హృదయమున గాఢమై యొప్పెను. 'యంత్రస్య గుణదోషా న యంత్రిణః పురుషోత్తమ। అహం యంత్రం భవాన్

యంతి) మమ దోషో న విద్యతే॥' అను ఉత్తర గీతానుగుణ్యముగ నింక నాదేవిగాక యతని బాధ్యతల వహించు వారెవ్వరు? నిరంతర దేవీదర్శనభాగ్యముతో నైన దృష్టినొందక నాదేవీ సహాయమున నెట్టి యమూల్య విషయముల మన రామకృష్ణుడు గ్రహించెనో మన మిక యెఱుంగ యత్నింతము.

## వివిధ సాధనలు

'శక్తిజ్ఞానం వినా దేవి నిర్వాణం నోపలభ్యతే' శక్తిజ్ఞానము లేక అమృత నిర్వాణపదవి యలభ్యము అను తంత్రవచనానుసరణి సమస్త విశ్వమునకు గర్త్రియై, సర్వాధారమును, సర్వమూలమును, శక్తిస్వరూపమును, ఆదిశక్తియు, బరాశక్తియునైన కాళికాదేవిని దన భక్తిపాశములచే బంధించి, సాక్షాత్కరింప జేసికొనిన మన రామకృష్ణునకు, ఇతరములగు రామకృష్ణాది దేవతల నుపాసించి, సాక్షాత్కారము నొందవలయు నను సంకల్పము జనించెను. పంచవిధభక్తులలో ద్వితీయమగు దాస్యభక్తిచే ఆనందరాముని దర్శనమునకై రామకృష్ణుడు పూనెను. ఆ దాస్య భక్తికి ఆదర్శముగ ఆజన్మబ్రహ్మచారియు, నిర్వహణదక్షుడును, అయిన హనుమంతుని మన రామకృష్ణుడుపాసింపనెంచి, తానే స్వయముగ నా యంజనీసుతు డని భావించి, సాధనారంగమున బ్రవేశించెను. ఆ యుపాసనబలమున నతడు వానరమువలె నపక్వాహారముల గైకొనుచు, దదేకాగ్రచిత్తుడై దేవాలయ ప్రాంగణమునగల ఆమలక పంచవటీ వృక్షప్రాంతముల వృక్షములపై నధికముగ వసించుచు, శ్రీరామచంద్ర

పాదారవింద దర్శన లాలసత్వమున మన రామకృష్ణుడు తపింప జొచ్చెను. ఆయుపాసనా తీవ్రతచే రామకృష్ణునకు వెన్నెముక యొక యంగుళము పెరిగి తోకవలెనుండెను. శ్రీ రఘువీర నామముగాక నన్యస్మరణములేని తీవ్రతనున్న మన రామ కృష్ణుడు ఒకనాటి సాయంకాలమున బంచవటిక్రింద ఆసీనుడై గంగాభిముఖుడై యుండ, దేదీప్యమాన రూపమున వెలుగొం దుచు, ప్రేమమూర్తియగు నొక యువతీలలామ అలౌకిక తేజోమయమై గంగాతీరమున నిలువబడి యుండుటయు, 'ఈమె దేవతాస్త్రీయై యుండనోపు' అని రామకృష్ణుడు తలచుచుండ, నొక మర్కటము ఆమెప్రక్క కరుదెంచి, నమస్కరించుటయు నతడు గాంచెను. ఆదివ్యస్వరూపిణి జనకరాజ తనయయు, అయోనిజయు, శ్రీరామచంద్ర ప్రేమైక పత్నియునైన సీతామహాదేవిగా నతడు వెంటనే గ్రహించి, 'అమ్మా' యనుచు నామె చెంతకరుగ, నామెయు మెల్లన చిరునగవుతో మన రామకృష్ణుని సమీపించి అతని యందు లీనమయ్యెను. వెంటనే మన రామకృష్ణుడు చైతన్య మును గోల్పోయెను.

తర్వాత గొంతకాలమునకు జటధారియను నొక సాధు పుంగవుడు దక్షిణేశ్వరమున కరుదెంచెను. అతడు రామో పాసకుడై, అయ్యుపాసనా ఫలితముగ, శ్రీరామచంద్రుని విగ్రహ మాతనికి పంచవర్ష బాలునిరూపమున గోచరింప, నామూర్తి కాతడు అనేక సేవల జేయుచుండును. దీని నంతటిని మన రామకృష్ణుడు గాంచి, అధికకాలము ఆజటధారి వద్దనే గడుపుచుండ, నబ్బాలచంద్రుడు క్రమముగ రామకృష్ణుని

ప్రేమించుచు, విడువక వెన్నంటి దిరుగాడ జొచ్చెను. ఇక శ్రీరామకృష్ణునితోనుండ దన సంకల్పమనిగూడ జటధారికి ఆ బాలుడు వచించెను. జటధారియు మన రామకృష్ణుని మహిమాతిశయమును గ్రహించి, సంతసించి, సమ్మతించి, రామలాల విగ్రహమును మన రామకృష్ణున కర్పించి వెడలి పోయెను. అంత రామకృష్ణుడు వాత్సల్యభావమున శ్రీరామచంద్రు నుపాసించుచు, ప్రతిదిన మా దశరథనందనునితో నాడుచు, బాడుచునుండెను. ఆ బాలరాముడును, తన కొంటె పనులచే, బాల్యచేష్టలచే రామకృష్ణునిపై నెక్కుచు, నల్లరి జేయుచుండువాడు. ఒకపర్యాయము తన కేదైన తినుబండారము వలయునని ఆబాలుడు బాధింప, మన రామకృష్ణుడు కొన్ని యటుకుల నొసంగెను. వాని దినుచున్న నా రామలాలుని మృదు కోమలమైన నాలుక, అటుకుల గల పొట్టుచే గీచుకొని యినుమంత రక్తము స్రవించెను. దాని గాంచి మన రామకృష్ణుడు, 'అయ్యో! నే నెందులకు వీని బెట్టితిని? వెన్న మీగడలతో గౌశల్య యీ బాలభాస్కరు నెంత యల్లారు ముద్దుగా సాకినదో? నే డెంత కష్టము వాటిల్లినది' అని మనంబున ననేక విధంబుల చింతించి, రామచంద్రుని యూరడించి, పశ్చాత్తాపము నొందెను. వాత్సల్యభావమున సిద్ధత్వము మన రామకృష్ణుడు సాధించిన పిమ్మట నా రామలాలుడు అతనిలో విలీనమయ్యెను.

'భగవంతుడొక్కడే పురుషుడు, అతని ప్రేమపత్నిని నేను' అను మధురభావము నుపాసించి, శ్రీ కృష్ణసాక్షాత్కారము బడయ మన రామకృష్ణుడు నిర్ణయించెను. మధుర

భక్తిచే నాగోపాలబాలుని వశంవదుని గావించుకొనిన ధన్యజీవి రాధను ఆదర్శముగ గ్రహించి, స్త్రీదుస్తులగూడ ధరించి తొలి రాధికారాణికై ప్రార్థించెడివాడు మన రామకృష్ణుడు. ఒకనాడు శ్రీ కృష్ణపరమాత్మ కాంతరంగిక భక్తురాలు అగు రాధ రామ కృష్ణునికి ప్రత్యక్షమై అతనియందు ప్రవేశించెను. అంత డానే రాధిక నను నిశ్చయమున నతడు దీవ్ర కృష్ణ విరహవేదనను బొందుచు, అసమాన బాధ ననుభవించి అచిరకాలమున నీలవర్ణ శరీరుండును, యశోదానందనుండును, జగన్మోహనాకారియు, నగు శ్రీ కృష్ణభగవానుని దర్శించి ఆమందానందము నొందెను. శ్రీ కృష్ణపరమాత్మయు మన రామకృష్ణునందు లీనమై మన రామకృష్ణుని సర్వస్వరూపునిగా గావించెను.

ఒకనాడు దక్షిణేశ్వరమునకు మహమ్మదీయ గురువగు గోవిందరాయి యరుదెంచిన, మన రామకృష్ణుడు అతనివలన ఇస్లాముమత రహస్యముల గ్రహించి, అల్లా నుపాసింప గడంగెను. మహమ్మదీయ సాధనావిధానమైన నవాజు ననుసరించుచు, అల్లాస్మరణ గావించుచు, ఆచారవ్యవహారములందును ఆ మతావలంబకుల ననుసరించుచు, నేకాగ్రచిత్తుడై మన రామకృష్ణు డుపాసించెను. త్రిరాత్రముల యుగ్రసాధనా ఫలితముగ మహమ్మదీయ సాధనాసిద్ధిని, అందలి మహాదనుభూతిని అతడు పొందెను.

ఈమతాంతర రహస్యముల గ్రహించినపిమ్మట మన రామకృష్ణుడు దక్షిణేశ్వరీ ఆలయసమీపమునగల యదుమల్లికుని దోటయందు ఏసుక్రీస్తు నెత్తుకొనియున్న మేరీకన్య చిత్ర

పటము గాంచుట తటస్థించెను. వెంటనే యతడు క్రీస్తుతత్త్వమును, క్రైస్తవమత సాధనాఫలిత అనుభవములను గడింపవలయునని దలంచెను. తలంపు కలుగుట ఆలస్యమేకాని దానినాచరించి తత్ఫలితమును బొందుటయందుమాత్రము రామకృష్ణుని విధానము అసమానము. కాన వెంటనే క్రీస్తుసందర్శనాయత్త మనస్కుడై తీవ్రకృషి యొనర్పగడంగెను. అంత మూడవదినముననే రామకృష్ణుడు పంచవటియందు దన్మయతో దిరుగుచుండ, దివ్యతేజము ముఖంబున దాండవింప, సుందర స్వరూపుడగు నొక మహాపురుషుడు తనవద్దకు వచ్చుచుండుట అతడు వీక్షించెను. శిలువపైవేసి తనను దారుణబాధలముంచిన క్రూరులగాంచి దయారస మొలికించుచు, 'ఓ సర్వేశ్వరా, వారుజేయునది వారికే తెలియదు. వారిని క్షమింపుము' అని ఆమందుల యజ్ఞానమునకు జింతించి, వారికై ప్రార్థించి, తన యపారవిశాలత్వమును బ్రదర్శించిన ప్రేమమూర్తి యగు క్రీస్తుగా నతని మన రామకృష్ణుడు గుర్తించెను. ఆమూర్తియు నంత మన రామకృష్ణుని బరిష్వంగమున జేర్చి రామకృష్ణునితో నేకమైపోయెను.

పై రీతిగ భక్తిసిద్ధాంతమునగల శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురములను బంచ భక్తిభావములచే సర్వదేవతల సాక్షాత్కారమునొంది, తనలో వారిని లయింపజేసికొనిన యా మహానుభావుడు ఇతఃపూర్వమే భగవంతుని దల్లిగా గాంచుట యను నొక విశిష్టమార్గమును ద్రొక్కి, జగజ్జనని సందర్శనానందమున అవ్యయానందము ననుభవించెను. ఆ ప్రత్యేకత ఎట్టిదో ఒకించుక చూచెదముగాక !

మానవుడు అనగా శాస్త్రోపదిష్టిత సల్లక్షణోపేతుడగు వాడు ఏరీతి ఉపాసించిన భగవాను డట్లే దర్శనమొసంగునని మన ఆర్ష సంప్రదాయము. మనస్సు నిర్మలమై, సమస్త ప్రపంచముకంటె దైవమే సత్యమని గాఢముగ విశ్వసించి, ఆయనకై తపించు భక్తునికిమాత్రమే 'యేనాకారేణ యే మర్త్యాః మామేవైక ముపాసతే। తేనాకారేణ తేభ్యోహం ప్రసన్నో వాంఛితం దదే॥' ఏ మానవు లేయాకారముతో నన్ను ఉపాసింతురో, ఆ రూపముతోడనే వారికి నేను ప్రసన్నుడనై కోర్కెల నీడేర్చుచుంటి నను శివగీత వచన విధానమున భగవత్సందర్శనము కలుగుచున్నది. అందుచేత 'భక్తి రేవైనం గమయతి। భక్తి రేవైనం దర్శయతి। భక్తివశః పురుషః' భక్తియే వానిని బొందించునది. భక్తియే వానిని దర్శింపజేయునది. భక్తివశుడు పురుషుడని శ్రుతి భక్తి ఆధిక్యతను జాటియున్నది. పై విధముగ నుండు ఆ భక్తి, శాంత దాస్య సఖ్య వాత్సల్య మధురములుగా రూపొందియున్నది. రాజాధిరాజు దరిజేరుట కెట్లు పలనుపడదో, దూరముననే ఆ సార్వభౌమునిగాంచి వినయ విధేయతల నెట్లు గేల్మోడ్చి భయభక్తుల మెలంగవలయునో అట్లే విశ్వసామ్రాజ్యాధినాధుడగు భగవానుని యుపాసించుట శాంత భక్తి యగును. యజమాని యాజ్ఞల నౌదలధరించుచు, వాని కనుసన్నల మెలగుచు, సకల సేవలను విశ్వాసపాత్రుడైన సేవకుడెట్లు గావించునో అట్లే భగవంతుని యజమానిగభావించి, తాను సేవకుడై సేవించుట దాస్యభక్తి యగుచున్నది. అంతట బాహ్యమునకు శరీరములు ద్వివిధముగనున్నను మనస్సుమాత్ర మొక్కటియై, హృదయగత రహస్యముల నే యరమరికలులేక

బరస్పరము దెలుపుకొనుచు, నధిక స్నేహముతో మెలంగు మిత్రద్వయముపగిది ఆ దేవదేవునితో స్నేహము నెరపుట సఖ్య భక్తియై రాజిల్లుచున్నది. ఆపై, దల్లి, బిడ్డను నెంతగాఢముగ ప్రేమించి, ఆ బిడ్డనే తన సర్వస్వముగ భావించునో అట్లే ఆ పురాణపురుషుడగు నా యీశ్వరుని శిశువుగా ప్రేమించుట వాత్సల్యభక్తియందలి రహస్యము. భార్యా భర్తల ప్రేమవలె భగవంతుని భర్తగా అనగా సర్వభారముల భరించువానిగ నెంచి ఉపాసించుట మధురభక్తియని తాత్పర్యము.

పై బంచవిధానముల కంటె నున్నతస్థానము నాక్రమించిన దీ శ్రీరామకృష్ణ భక్తివిధానము. అదియే భగవంతుని మాతృ ఉపాసనము. పై అయిదింటిలోగల స్వతంత్రత యిట నభావము. సర్వ స్వాతంత్ర్యముల బోనాడి, సర్వమునకు జనని పైనమాత్ర మాధారపడియుండు పసిబిడ్డవోలె, భగవంతుని దల్లిగ వీక్షించుచు, సర్వబాధ్యతల నామెపై నునిచి, ఉపాసించుటయే యిందలి పరమ రహస్యము. అట్లు యీ మార్గము నవలంబించియే శ్రీరామకృష్ణుడు తన మాతృప్రేమచే భయంకర మూర్తియగు కాళికాశక్తిని ప్రేమమూర్తిగా జేయగల్గెను. రాజసగుణాధిక్యతచే జెల్వొందు నా మూర్తిని బూజించియు సత్వగుణ సంశోభితుడై తనరెను. భీకరరూపము నారాధించియు శాంతస్థితినే గడింపగల్గెను. భగవంతుని శక్తిగ భావించి, ఆమెను మాతృదేవతగ నుపాసించి, ఆమెయే సృష్టి స్థితి లయ కారిణి యని గ్రహించి, సాధనయందెట్టి ఆటంకముల గాంచక, ఆ ఉపాసనా ఫలితముగ సర్వమును జగన్మాతృ స్వరూపముగా దిలకించుటయే యిందలి నిగూఢతత్త్వము. అదియే శాక్తేయము.

శాక్తేయ మనుటతోట భయమావరించునుగాని యథార్థమున నట భయకారణ మగోచరము. మన తల్లిముందు మనకు భయ మెట్లుగానరాదో అట్లే భగవంతుని దల్లిగా ఉపాసించుట యందును భయమునకు దావులేదు. శిశు వెట్టి కల్మషములు లేక అమాయకుడై దల్లినిగాక నన్యమును గాంక్షింపడో, తన సర్వము తల్లియే యని విశ్వసించునో అట్లే యీ ఉపాసకుడును నిర్మలుడై అనగా ప్రాపంచిక విషయములు లేనివాడై, జగజ్జననియగు శక్తిని ఉపాసించును.

ఈ విధముగనే మన గురుదేవుడు శాక్తేయ సిద్ధాంతము నామూలాగ్రము గ్రహియించి, శాక్తేయమన సందేహ ములుగల ప్రజానీకమునకు అది నిర్దుష్టమని చక్కగ బోధించెను. శాక్తేయ మన శక్తిసంబంధము. సర్వప్రపంచ మున గర్మ నాచరింపని ప్రాణి ఎచటను లేదు. ఏక్రియ నొనరించుటకును శక్తి ప్రస్ఫుటము. శక్తిలేనిది దేనిని నిర్వహింప జాలముగదా! ఉచ్ఛ్వాస నిశ్వాసములునుగూడ శక్తియధీనమే. 'యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా' ఏ దేవి సర్వభూతకోటియందు శక్తిరూపమున నున్నదో, అను సప్తశతీవాక్యవిధానమున, నీ సమస్తలోకము శక్తిచే బరిపూర్ణమై, శక్తియధీనమై, శక్తియొక్క రూపాంతరమై యొప్పుచున్నది. శక్తియేగదా సృష్టి స్థితి లయముల నొనరించుట! అనగా వివిధ రూపముల బ్రపంచమున వ్యక్తమగుచున్న శక్తియొక్క సమష్టి స్వరూపమే, శక్తినాబడు దేవియొక్క సమగ్ర మూర్తిత్వమని సువిదితము. ఇదియే శక్తియొక్క స్వరూపము. దీనిని వివరించు శాస్త్రములు తంత్రములు నా ప్రశస్తములు. తంత్రముల బర

మేశ్వరుడు పార్వతి కుపదేశించినట్లు ప్రశస్తము. అందు శక్తి యొక్క సర్వతోముఖత్వము వివరింపబడెను. ఇట్టి సర్వాధారమైన శక్తిని సాధింప యత్నించుట దంత్రసాధన యనియు ప్రాకొందురు. తంత్రమన సరియైన యర్థమును గ్రహింపజాలక కొందరు దీనియందు విపరీతార్థముల బెక్కింటి సృజించిరి. కాని యథార్థముగ సర్వలోకమున సృష్టి స్థితి లయ కార్యములలో, ముఖ్యముగ సృష్టి స్థితుల నిర్వహించు ప్రత్యక్ష శక్తిరూపములైన స్త్రీలోకమును, సర్వదా మాతృరూపమున గాంచగలుగుటయే తంత్రమునందలి పరమార్థము. తంత్రపదవ్యుత్పత్తి ననుసరించి చూచినను 'తన్యతే విస్తార్యతే అనేనేతి తంత్రం' రక్షించు జ్ఞానమును వ్యాపింపజేయునది తంత్ర మను నర్థము సుస్పష్టము. అంతియగాక నీ తంత్రార్థమును గూర్చి 'తనోతి విపులానర్థాన్ తత్త్వ మంత్ర సమన్వితాన్। త్రాణం చ కురుతే యస్మా త్తంత్రమిత్యభిధీయతే॥' తత్త్వ మంత్ర సమన్వితములైన విపులార్థముల నిడునదియు, రక్షణమునొసంగునదియు తంత్రమని శైవతంత్రము పదేశించుచున్నది. అందుచేత నీ తంత్రసిద్ధాంతము అనగా శాక్తేయము ఏవిధముగను లోపభూయిష్టము గాదని సుబోధితము. ఈ తంత్ర శాస్త్రములు అయిదువందలు గలవనియు, నందు శక్తిసంబంధమైనవి అరువదియారు, శైవపరము ముప్పదిరెండు, వైష్ణవము డెబ్బదియైదు, యితరములు మూడువందల యిరువదియేడు అనియు జెప్పబడుచున్నవి.

# భైరవీ బ్రాహ్మణి - తంత్రసాధన

ఇట్టి సర్వవిశాలమును, నిర్దుష్టమును, ఆచరణీయమును అగు శక్తిసాధనను మన రామకృష్ణు డవలంబింప సంకల్పించెను. ఆసమయమున, ప్రపంచవిషయముల నిస్సారములుగ ద్రోసి, ఆధ్యాత్మికానంద యన్వేషణమున దీవ్ర తప మాచరించి, తంత్రశాస్త్రముల బరిశోధించి, దాని నవలంబించి, సాధించి, గురుస్థానము నధిష్ఠింప యోగ్యతను గడించి, శక్తి యాదేశానుసారము అర్హులగు నితరులకుగూడ బోధింప గుమ్మరుచు, ఆధ్యాత్మిక ప్రపంచమున నొక నూతన దివ్య కాంతిని వెదజల్లుచుండెను ఒక మహావ్యక్తి. వేదాంత తత్త్వముల బోధింప, గురుపదవి నలంకరింప, 'బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్' యను శ్రుతిరీతిగ బవిత్ర బ్రహ్మచర్యము నుండియే తురీయాశ్రమమును స్వీకరించి, అసమాన విదుషీ మణియై, అనుభవ సంపద్విశేషమున నాదర్శమై, యొప్పారెనావనితాలలామ భైరవి బ్రాహ్మణి గిరి. అర్హులకై యన్వేషించుచు నామె యొకనాడు దక్షిణేశ్వరమున కేతెంచెను. ఆహా, మన రామకృష్ణుడు సంకల్పించుటయు, వెంటనే తత్సంబంధు లరుదెంచుటయుగదా! సంకల్పసిద్ధియు దేవీ యనుగ్రహమును గలవారి కేమి కొరత యుండగలదు? బిడ్డల యవసరముల గమనించి, సమకూర్చుటయేగదా తల్లి యభీష్టము. కాన నా దయాస్వరూపిణి యైన దక్షిణేశ్వరి తన పుత్రరత్నమగు రామకృష్ణు సంకల్పముల నీడేర్చుటయు, నందు పూర్ణత్వమును బ్రసాదించుటయు, నానందము నొసంగుటయు, సర్వసాధా

రణము. అవును, అట్టి సర్వ శక్తిసంపన్ను ని గలిగియుండుటయు నామె కానంద దాయకముగదా!

ఇట్లరుదెంచిన ఆ సన్న్యాసిని రామకృష్ణుని ఆ పాద మస్తకము బరీక్షించి, శక్తిపూజాధురంధరుడని గ్రహించి తా వచ్చిన కార్యసాఫల్యమునకై తలంచుచుండెను. తన కాది గురువై ఆధ్యాత్మికాధిష్ఠాతయైన గాళికామాయియే, తంత్ర సాధనల దనచే జేయింప నరుదెంచినదని మన రామకృష్ణుడును విశ్వసించెను. అతనికి సర్వదా సహాయము జేయ జగన్మాత ప్రక్కనే యుండ, సర్వాంతర్గతయై యొప్పార నతనికి భయ మేల? కొరతయేల? కాన నిర్భయుడై, నిస్సందేహుడై, నిర్మ లుడై బ్రాహ్మణిపనుపున సాధనల కతడు ఉపక్రమించెను. ప్రథమమునుండి భైరవీ రామకృష్ణులకు అవ్యాజప్రేమవాత్సల్య ములు యేర్పడ జొచ్చెను. మొదటి దినమున, బ్రాహ్మణి తన యిష్టదైవమునకు నివేదన పదార్థముల ముందుంచి ధ్యాన నిమగ్నయైయుండ, నాసమయమున దన గదియందున్న రామ కృష్ణుడు అసంపూర్ణ శరీరస్మృతితో నట కరుదెంచి, నైవేద్య ముల దానే భుజింప గడంగెను. బ్రాహ్మణికి ధ్యానమందున్న శ్రీరామచంద్రు డదృశ్యమై యాస్థానమున రామకృష్ణుడు గోచ రించెను. ఆశ్చర్యమానసయై కన్నుల దెరచిచూడ బ్రత్యక్షముగ రామకృష్ణుడు నైవేద్యముల భుజించుచుండుట గాంచి, తన యిష్టదైవమైన రామచంద్రుడే యీ రామకృష్ణుడని ఆమె యర్థించెను. మరియు రామకృష్ణునందు శ్రీకృష్ణచైతన్యలక్షణ ముల ననేకము ఆమె గాంచి విస్మయానందముల నొందెను.

కొలదిదినముల పిమ్మట బ్రాహ్మణి తన కర్తవ్యమును, శ్రీవిశ్వే శ్వరీ యాదేశమును దలంచి, శ్రీరామకృష్ణునకు దంత్రమార్గము నుపదేశించెను. సర్వశక్తి సంపన్నుడైన మన రామకృష్ణుడు అచిరకాలమున బ్రాహ్మణి బోధించు అరువదినాలుగు తంత్ర సాధనలముల నేర్పొప్ప జరించి, తత్సిద్ధిని జగన్మాత పరిపూర్ణ యనుగ్రహ విశేషమున బడయగల్గెను. మనలో షట్చక్రోప విష్టయగు అపూర్వ శక్తి యొండు గలదనియు, నదియే కుండలినీ పరాశక్తి యనియు, అది తంత్రసాధనా పద్ధతిచే మేల్కొని, యూర్ధ్వగమన మొనరించుచు నారవ చక్రమగు ఆజ్ఞాచక్రమును జేరి సహస్రారము బ్రవేశించుననియు అనుభవజ్ఞుల వచనములు. తంత్రసాధనాఫలితముగ రామకృష్ణునకు గుండలినీ ప్రకోప మున సర్వాధ్యాత్మికానుభవముల సులభముగా బడసెను. కాన దంత్రసాధనా సిద్ధి యనబరగు సర్వమును మాతృదృష్టి గాంచుట యతనికి సహజమై రాజిల్లెను. సర్వ వనితా సమూహ మతనికి దన మాతృదేవివలెనే గానుపించెను. జితేం ద్రియుడైన నత్యతిగణ సార్వభౌమునికిగాక నన్యులకు యిది సాధ్యమే! అందుచేతనే యతని అమూల్య పవిత్ర సందే శము సర్వప్రపంచమున నచిరకాలములో వ్యాపించి ప్రపంచ తారకమై యుప్పారినది.

## తోతాపురి - సన్న్యాసము

ఇట్లుండ సర్వసాధనానుభవ విభూషితుడైన మన రామ కృష్ణుని దృష్టి యద్వైత భావములపై బడెను. సప్తవర్ష ప్రాయ

మున గృహమును బాసి, నాగసాంప్రదాయిక పీఠాధిపతియై, దానినిగూడ ద్యజించి, యరణ్యముల కేగి, యుగ్రసాధనల మునిగి, పవిత్ర నర్మదా తీరమున నలువది వత్సరములు తీవ్ర తపంబొనర్చి, అద్వైతమూలమును, అద్వైత సిద్ధియు, పరమ గమ్యమును అగు నిర్వికల్పమును బొంది, యటనుండి పరివ్రాజకుడై 'అకసమె కప్పు గడ్డియె పరుండు పాన్పు' అను చందము వ్యవహరించుచు, 'ప్రాణే గతే యథా దేహః సుఖదుఃఖే న విందతి। తథాచే త్ప్రాణయుక్తోపి స కైవల్యాశ్రయో భవేత్ ॥' ప్రాణవిగత దేహమున కెట్లు సుఖ దుఃఖములు లేవో అట్లే ప్రాణముండియు నుండువాడు కైవల్యము నధిష్ఠించును అను శ్లోక తాత్పర్యమున సకల ద్వంద్వాతీతుడై, దేశదేశముల గ్రుమ్మరుచు తోతాపురీ నామధేయుడగు నొక యద్భుత వ్యక్తి, మన రామకృష్ణు డద్వైతము గోరు సమయమున దక్షిణేశ్వరమున కరుదెంచెను. దక్షిణేశ్వరాలయ ప్రవేశముననే షోడశ కళాపరిపూర్ణుడై ఆధ్యాత్మిక రేరాజువలె సగుణానుభవ గణములచే వికసించు రామకృష్ణుని తోతాపురి వీక్షించి, రామకృష్ణుని సమీపించి, 'నీకు సగుణోపాసన పూర్తియైనట్లున్నది. అందుచే నిక నిర్గుణమును, సర్వాతీతమగు, అద్వైతమును గ్రహింపవలెను, అనుభవింపవలెను. అద్వైతము నభ్యసింతువా?' యని ప్రశ్నింప జగజ్జనని యాజ్ఞానువర్తియగు మన రామకృష్ణుడు, 'మా యమ్మను అడిగివచ్చెద' నని దేవాలయమున కరిగి 'అమ్మా, ఎవరో తోతాపురి యను దిగంబరి సాధువు నాకద్వైత ముపదేశించునట. నేర్చుకొనమందువా?' అని ప్రశ్నించెను. అందుల కామె యియ్యకొనెను. మన కవ్యక్తమగు

భాషలో, మన కచేతనముగ గోచరించు నాదేవిని అత డడు గుటయు, నామె యక్షరములులేని భాషలో సమాధాన మొసంగుటయు, అస్మదాదులకు అవిస్పష్టము. స్థూలమైన వదనమునకు భాష యవసరముకాని, అతిసూక్ష్మమగు హృద యమునకు భాషయేల? అందుచే 'మాటచేగాక హృదయాన నోటచేత' అనునట్లు బాహ్యమగు భాషచేగాక నంతరమగు హృదయముచేతనే భగవంతుడు వ్యక్తము. ఆ యవ్యక్త భాషావైశిష్ట్యము భగవద్భక్తులకు దెలియును గాని అన్యుల కేమెరుక? ఆసంభాషణా మాధుర్యము కాళీ రామకృష్ణుల కే గ్రాహ్యము. అట్లు దేవీసమ్మతిని బడసి మన రామకృష్ణుడు, తోతాపురికి అమ్మ సమ్మతిని దెలిపెను.

## నిర్వికల్పము

కాని 'యశ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి। తదేవ బ్రహ్మత్వం విద్ధి' ఏది నేత్రములచే జూడబడదో, నేత్ర ములు దేనిచే జూచుచున్నవో, అదియే బ్రహ్మము అని గ్రహిం పుము అను మంత్రమునుండి 'యన్మనసా న మనుతే యేనాహు ర్మనోమతం। తదేవ బ్రహ్మత్వం విద్ధి...' ఏది మనస్సుచే మననీయముకాదో, మనస్సు దేనిచే మనన మొనర్చుచున్నదో అదియే బ్రహ్మమని గ్రహింపుము అను కేనోపనిషద్వాక్యసర ణిని నిర్గుణమునే యంగీకరించు తోతాపురి రామకృష్ణుని స్థితి గ్రహింపజాలక వెర్రిగా భావించెను. అయినను అతనిచే నాకర్షింపబడినవా డగుటచే తోతాపురి, అద్వైతసిద్ధికొరకు సర్వ

బంధ విచ్ఛేదనము గావలయును గాన, 'న సన్న్యాసాత్ పరో ధర్మః' సన్న్యాసము కంటె ఉత్తమధర్మము లేదు గాన రామకృష్ణుని సన్న్యసింపగోరెను. అందులకు సమ్మతించి, తత్సంబంధ విరజాదిహోమ కార్యకలాపములముగింప, 'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్' ఎపుడు విరక్తి జనించునో తత్క్షణమే సన్న్యసింపవలయు నను కైవల్యోపనిషద్వాక్యమురీతి సన్న్యసించి, గురువు సన్నిధానమున నద్వైతసిద్ధి నపేక్షించి మన రామకృష్ణుడు ఆసీనుడయ్యెను. 'బ్రహ్మ సత్యం' బ్రహ్మము సత్యమనియు, 'తమేవ భాంత మనుభాతి సర్వం । తస్య భాసా సర్వమిదం విభాతి' ప్రకాశమగు బ్రహ్మము ననుసరించియే సర్వము ప్రకాశించుచున్నది. ఆ బ్రహ్మజ్యోతిచేతనే సర్వము భాసించుచున్నది యను ముండకోపనిష ద్వాక్య విధాన బ్రహ్మము ప్రకాశమనియు, 'అజో నిత్య శ్శాశ్వతః' బ్రహ్మము అజమై నిత్యమై శాశ్వతము అను గీతాప్రమాణరీతి జననమరణ రహితమనియు, నిరవయవ నిత్య శుద్ధ బుద్ధ ముక్తమైనదనియు, మొదలగు అసంఖ్యాకమైన శ్రుతి స్మృతి వాక్యములచే తోతాపురి రామకృష్ణునకు బ్రహ్మము నుపదేశించి, దాని నపరోక్షానుభూతి నొంద నిర్వికల్పసమాధియే శరణ్యమని బోధింప, మన రామకృష్ణుడు, గాఢ ధ్యానమగ్నుడై సులభముగ బూర్వ ద్వైతస్థితుల దొలగద్రోసి, అపూర్వమును, అసాధ్యమును, అగు నిర్వికల్పసమాధియందు మూడుదినములు అవిచ్ఛిన్నముగ మగ్నతబొందెను. బోధించియు బోధింపక పూర్వమే అసమానముగ నిర్వికల్పమును అనుభవించిన మన రామకృష్ణుని వీక్షించి, తోతాపురి 'ఆహా, నలువది వత్సరములు ప్రపంచ మను

మాటనుగూడ మరచి, తీవ్ర తపమొనరించి, నేను నిర్వికల్ప మును బొందినను కొలది నిముషములుమాత్రమే యా యానందము నాస్వాదింప గలిగి యుంటిని. కాన చిత్రాతి చిత్రము. ఎట్టి ప్రత్యేకసాధనయు లేక నిర్వికల్పమును పొందు టయేగాక, నితడు మూడుదినములు దానియందు ఓలలాడుట జూడ మహాశ్చర్యముగ నున్నది. ఈత డింకను ఇట్లేయున్నచో నీశరీరము గాజుముక్కవలె చిట్లిపోవును. ఇతడు లోకమున జేయవలసిన కార్యములు ఉత్కృష్టములు. కాన నిర్వికల్పాను భూతి యిక నితనికి జాలు' నని శిష్యవరేణ్యుని బాహ్యస్మృతికి దెచ్చెను. తన శిష్యుని యదృష్టమున కానందించి, నాడే తోతాపురి యూరకున్నచో, మనకు శ్రీరామకృష్ణుని యమూ ల్యోపదేశము లెట్లు సంభవించెడివి? ఈ ప్రపంచమున దుఃఖితులకొరకై తోతాపురి రామకృష్ణునికి బాహ్యస్మృతిని గలిగించెను. సద్గురు సన్నిధానమున మన రామకృష్ణుడు సన్న్యాస చిహ్నమగు కాషాయమును కొంతకాలము మాత్రమే ధరించి, మరల సాధారణమైన తెల్లని వస్త్రమును ధరించుచు, గామ కాంచన జయము, జితేంద్రియత్వము, త్యాగము ప్రధానముగ నున్న తనకు యీ బాహ్యచిహ్నములు అనావశ్యకమని తీసివేసెను.

## సర్వమత సామరస్యము

ఈ విధముగ సర్వదేవతల సృజించి పోషించు ఆద్య శక్తి కాళికను మాతృదేవిగ ఉపాసించి, వశము గావించు

కొనుటచే ఆశక్తియొక్క యంశములగు ఇతర దేవతాగణముల నామె యనుగ్రహవిశేషమున సాధించుట మన రామకృష్ణునకు సులభ సాధ్యమయ్యెను. పెద్ద భవనమునకుగల తాళము ఎవనివద్ద నుండునో, వాడు ఆభవన విశేషములెల్ల నెట్లు విలోకింపగల్గునో, అటులే మన రామకృష్ణుడు, ఆధ్యాత్మికానందసౌధ విశేషముల ననుభవింప నవసరమైన కీలకమగు గాళిక తన హస్తగతమగుటచే సర్వదేవతలును అతనికి సాధ్యమయ్యెను. కాంచితిరా! ఏయొక్క యల్ప అనుభూతితో దృప్తి నొంది యూరకుండక, సర్వమత సర్వసాధనల గాలించిచైచి, సర్వానుభవ సంపూర్ణుడై, సర్వమతముల నేకదృష్టిగని, సర్వసమత్వమును, సర్వమానవ సౌభ్రాతృత్వమును లోకమునకు బ్రకటించు మహావ్యక్తియై రూపొందెను మన రామకృష్ణదేవుడు. అందుచేతనే కాలాంతరమున దనను చేరిన శిష్యుల సంస్కారముల ననుసరించి, వివిధ మంత్రోపదేశములగావించి, ఆ యా మార్గముల నభివృద్ధి వారికి నతడు గలుగజేసెను. కాన విశాలదృష్టి సర్వమత సమన్వయము అతనికి సాధ్యము. అది కేవలము భగవదంశ సంభూతులకే అనుభవైకవేద్యము. సీతారాముల, రాధా కృష్ణుల, క్రీస్తు మహమ్మదుల, మరియు సకల దేవతల స్వరూపమే తానగుటచే, మరియు గయాధినాథుడగు శ్రీమహా విష్ణువును, కామారి పుష్కరిణీదేవుడగు పరమేశ్వరుడును, ఏకస్వరూపమున దానే యగుటచే సర్వము మన రామకృష్ణునకు సులభ సాధ్యమయ్యెను. సర్వ మత సర్వదేవతా రహస్యముల బ్రత్యక్షముగ ననుభవించి యుండుటచేత మన రామకృష్ణుడు 'తమాది దేవమజరం కేచి దాహు శ్శివాభిదం।

కేచి ద్విష్ణుం సదా సత్యం బ్రహ్మాణం కేచిదూచిరే॥’ అజరమగు నా దేవుని గొందరు శివుడనియు, గొందరు విష్ణువనియు, మరియు గొందరు సత్యమనియు, బ్రహ్మమనియు బలుకుచుందురు అను శాస్త్రమురీతి ఏకమగు భగవంతునికి ననేక నామరూపములు నిర్ణీతమైనవనియు, నొక్కొక్క మతమున నొక్కొక్క సాధనా విధానము అవలంబనీయముగ గలదనియు, గాని ‘ఏకం సంతం బహుధా కల్పయంతి’ ఒక్కడే యగు భగవానుని నానాత్వముగ కల్పించుచున్నారనియు, ‘వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం’ అనురీతి నామధేయాదులు వికారములై వాఙ్మాత్రముగనుండ దదధిష్ఠానమైన బ్రహ్మము సత్యమనియు, శ్రుతిప్రోక్త సమన్వయ రహస్యముల బ్రపంచమునకు మన రామకృష్ణదేవుడు చాటి తరుణోపాయమును బ్రసాదించెను.

## అవతార వరిష్ఠుడు

అందుచే నిట్టి సర్వ సమగ్ర స్వరూపుడైన మన రామకృష్ణుడు కేవలమొక భక్తుడుగాక అవతారపురుషుడని నిర్ణయించుట సామాన్యముగదా ! అందుచే నతని మహోన్నత స్థితి కాశ్చర్య నిమగ్నయైన భైరవీబ్రాహ్మణి కంకణము ధరించి, ఆవిషయమును బ్రకటింప నిశ్చయించి, మధురనాథునిద్వారా ఒక పండిత సభను సమావేశపరచెను. వంగరాష్ట్రమునగల సహస్రాధిక శిష్యగణములుగల వైష్ణవచరణుడును, శాక్తగురువైన గౌరీపండితుడునుగూడ సభ కరుదెంచిరి. అనేకవిధముల

సమర్థురాలైన బ్రాహ్మణి సభాస్థలి ఉపన్యాసవేదికపై వీర మాతవోలె నిలిచి, అనేక శాస్త్రప్రమాణముల సహాయమున శ్రీ రామకృష్ణుని అసాధారణ లక్షణములు, భావ మహాభావాది సమాధిసంస్థితుల విపులీకరించి, సర్వలక్షణ శోభితుడైన యతడు అవతారమే యని నిర్ణయించి, వాదించు వారెవ్వరేనియుండిన సహేతుకముగ వాదింప నాహ్వానించెను. శ్రుత్యుక్త్యనుభవ సంపేతమగు నావాక్యముల కెదురునిలువ గలవారెవ్వరు! అంతియగాక వైష్ణవచరణుడు ముందుకేతెంచి, భైరవి వాదములకు సమ్మతించి, 'ఒక్కొక్క భక్తునిలో నేదియో యొక విధమైన అనుభూతియుండును. కాని యిన్ని అనుభవములు రామకృష్ణునిలోనుండుట అసాధారణము గాన నతడు అవతారపురుషుడు' అని వక్కాణించెను. అదేవిధమున శాక్తేయుడైన గౌరీపండితుడును ప్రకటించెను. ఇతర భక్తుల లోని మహాపురుషులలోని వివిధ లక్షణములు సమావేశమై తీర్మానించుకొని అన్నియు నతనియందు వసించుచు, మన రామకృష్ణుని అవతార వరేణ్యుని, అవతార వరిష్ఠుని, సద్గురు వర్యునిగా నొనర్చినవేమో!

అవతార వర్యుడని నిర్ణయింపబడినను, అనేక పండిత వర్గము తన చరణసేవ జేయుచున్నను, సాధకలోక మాశ్ర యించియున్నను, పాశ్చాత్య విద్యాధురీణు లనేకులు 'దాసోహ' మ్మనుచున్నను, మన రామకృష్ణ చిత్తము సర్వదా తుచ్ఛ ప్రాపంచిక విషయముల కతీతమై నిశ్చలమై యుండెను. అవును, మనస్సున కేది యలవరచిన నది దానినే స్వీకరించి అభి వృద్ధినొంప యత్నించును. పూతీవెను గంధపు వృక్షమున

కాసించిన దానినే ఆశ్రయించి చూపరుల కానందదాయకము కాగలదు. అట్లుగాక ఆపూతీవెనే కంటకయుత తుమ్మవృక్షము చెంత నాటిన నది దాని నాధారముగగొనుటచే నెవ్వరును దాని దరిజేరజాలరుగదా! పైవిధమున మన మనస్సును బాల్యమునుండి సద్విషయముల దెసకు మరలించి, సత్పురుషుల నాశ్రయించిన దదనుగుణముగను,దుర్విషయముల ద్రిప్పి, దుష్టుల నాశ్రయించిన దత్ప్రకారముగను రెుప్పారును. అట్లు ప్రథమమునుండి సత్సహవాసముచే సద్విషయముల గ్రహించి, వానికై కృషిసల్పి, వారి యాదర్శమును బొంది, సాధుసత్తముడైన మహాత్మునకు అమృతత్త్వప్రాప్తి సిద్ధించుటచే నింక నాతని చిత్త మీ తుచ్ఛ ప్రాపంచిక విషయముల వీక్షింపనేరదు. 'అమృతేన తు తృప్తస్య పయసా కిం ప్రయోజనం?' అమృతముచే దృప్తుడైనవానికి ఉదకముచే నేమి ప్రయోజనమను ఉత్తర గీతావాక్యరీతి నసత్యములును, భ్రాంతిరూపములును అగు నీ సంబంధముల గాంక్షింపడు. భగవద్దర్శనా రహితునకును, ఆధ్యాత్మిక గమ్యమగు నిర్వికల్పాది సమాధ్యనుభూతిసారముల గ్రోలనివానికి మాత్రమే యీ ప్రపంచము, అందలి వ్యవహారములుకాని ఆ రసాస్వాదన పరుని కేల యీ దుఃఖమూలమగు గోర్కెలు? అట్టి నిర్మల హృదయుని కిట్టి వాంఛలు జనింపవనుట దథ్యము. మరియు 'ఛిన్నాశాపాశా జాలస్య క్షీయతే చిత్తవిభ్రమః' ఆశాపాశాదులు నశించినవారికి జిత్తవిభ్రమము క్షయించుచున్నది. అట్టివాడే కృతకృత్యుడనియు, 'జ్ఞానమాత్రేణ తృప్తస్య కృతకృత్యస్య యోగినః। నైవాస్తి కించి త్కర్తవ్యం...' అట్లు జ్ఞానమాత్రమున దృప్తుడై, కృతకృత్యుడైన యోగికి జేయదగిన

దెద్దియును లేదని ఉత్తరగీతా కథనము. 'చిత్తం కారణ మర్థానాం' సర్వార్థములకు మనస్సే కారణముగాన, 'చిత్తే చలతి సంసారో నిశ్చలం మోక్ష ఉచ్యతే' చిత్త సంచలనము సంసార మనియు, చిత్త నిశ్చలత్వము మోక్షమనియు త్రిపురతాపిన్యు పనిష త్తాత్పర్యము గదా ! కాన స్వాధీనచిత్తుడైన మహాను భావుడగు మన రామకృష్ణుడు సంపూర్ణ విరాగస్వరూపుడై, విరాజిల్లుటయం దాశ్చర్యములేదు. అందుచేతనే కాళికాదేవి గనపరచిన అనేక మహాసిద్ధుల దృణముగ ద్రోసిపుచ్చెను. శాశ్వతమును, సత్యమును, శుద్ధమును, ఆనందఘనస్వరూప మును అగు భవతరణీ పాదపంకజ మకరందాస్వాదనాచిత్తుడగు మన రామకృష్ణుడు, అద్వితీయ, అవ్యయ, అవాచ్య బ్రహ్మా నంద సంశోభితుడైన మన రామకృష్ణుడు, అశాశ్వతమై, క్షణికమై, ఛాయామాత్రములగు నీ ప్రాపంచిక సుఖసము దాయముపై దృష్టి ప్రసరింప జేయగలడా !

ఆలయాధికారియు, శిష్యుడును అగు మధురబాబు ఒకనాడు ఒక పట్టుశాల్వను రామకృష్ణున కర్పించెను. పసిపిల్లవానివలె మన రామకృష్ణుడు దానికై అమితానందము నొందినవాడై, మరుక్షణముననే దాని గ్రింద బఱచైచి, దానిపై నుమిసి, ద్రొక్కజొచ్చెను. అవును, అది అతని కొక లెక్కయా! ఒకపర్యాయము మధురనాథుడు తన యాస్తిసంతటిని మన రామకృష్ణునికి అర్పింప సంకల్పించి, అతని స్వీకరింప నర్థించెను. కాని మన రామకృష్ణుడు సమ్మతింప జాలకపోయెను. 'క్షీయంతే ఖలు భూషణాని' అనుచందము ధనమువలన గీర్తిరాక, అవి నశ్వరములుగాన దుఃఖహేతువు లగుచున్నవి. కాన మరల

నట్టి యనవసర ప్రసంగము జేయకుండ మధురుని మన రామకృష్ణుడు మందలించెను. మరల నొకపర్యాయము రాధాకృష్ణ దేవాలయమున నొకనాటి రాత్రి చోరులు ప్రవేశించి, నగల నపహరించుటయు, నుదయముననే ఆసంగతిని దెలిసికొని మధురబాబు రాధాకృష్ణుల సంబోధించుచు 'నీ భూషణములగూడ కాపాడుకొన జాలకుంటివా కృష్ణా' అని పలుకుచుండ, నట కరుదెంచిన శ్రీ రామకృష్ణుడు ఆలకించి, 'ఏమి నీవెర్రి? ఇవి యన్నియు నీకు విలువగలవిగాని లక్ష్మినే పాదదాసిగాగల్గిన ఆ దేవదేవుని కేమి విలువ? ఇవి ఆ పరమేశ్వరునకు మృత్స్నమానములే సుమా!' అని భగవంతుని అతీతస్థితిని, ఆభరణముల నైజమును, తన త్యాగమును ప్రస్ఫుట పరచెను. దానిని మధురుడు స్మరించి, 'సమలోష్టాశ్మ కాచనః' మట్టి బంగారముల సమదృష్టిగలవారు అను గీతా వాక్యము చందము జ్ఞానులు సువర్ణాదికముల దృణముగ పరిగణించెదరు అని గ్రహించెను. అట్టివాడు మాత్రమే 'సర్వ భూత సమో మైత్ర స్సమలోష్టాశ్మ కాంచనః। ధ్యానయోగ రతో భిక్షుః ప్రాప్నోతి పరమాం గతిం॥' సర్వభూతముల మైత్రియు, లోష్ట కాంచనముల సమమున దిలకించుటయు, ధ్యానయోగరతుడు నైన భిక్షువు పరమమగు ఉత్తమగతిని బొందుచున్నాడని శంఖధర్మశాస్త్ర తాత్పర్యము. కాన మరల శ్రీ రామకృష్ణునితో ధనప్రసంగము మధురుడు గావింపజాల డయ్యెను. అవును, మన రామకృష్ణుని త్యాగస్థితియు అతని హృదయమున హత్తుకొనిపోవ నింక నామధురుడు ఎట్లు ప్రస్తా వించగలడు ?

ఇట్లే లక్ష్మీనారాయణ యను నొక మార్వాడి గురు దేవుని దర్శనార్థ మేతెంచి, దివ్యానందమును అనుభవించి, భక్త్యాధిక్యతగలిగి, శ్రీ రామకృష్ణునికి, బదివేల రూప్యముల నర్పింప సంకల్పించెను. తనకోర్కెను నెరవేర్చవలసినదిగా రామకృష్ణుని అతడు అర్థించెను. కాని రామకృష్ణు డెంత మాత్రము సమ్మతింపక 'ధనముచే ముక్తి గలుగునని భావించు చుంటివా? మోక్షప్రాప్తి 'న ధనేన' ధనముచే నసాధ్యము సుమా! త్యాగసాధ్యము ముక్తి. దానికై యత్నింపుము. నేను విశ్వేశ్వరీ పాదదాసుడగాని ధనదాసుడ గాను' అని సమాధాన మొసంగి ఆతని పంపివైచెను. గాంచితిరా, శ్రీ రామ కృష్ణుని ఆధిక్యత! ఆతని త్యాగరతిని దెలుపు సంఘటనలు అతని జీవితమున ననేకములుగా యుండి ప్రకాశించినవి.

## శ్రీ శా ర దా మా యి

ఇట్లు 1866వ సంవత్సరమునకు బరిపక్వమైన త్యాగాధి నాథుడు, అవతారశ్రేష్ఠుడు, సర్వ సాధనానిమగ్న జని తానందాబ్ధి నోలలాడు మన రామకృష్ణుడు సాధకుడై దేవీదర్శన ప్రాప్తికై పరితపించుచు, దక్షిణేశ్వరమున 1859 వ సంవత్సర మున నుండ, దన ముద్దుల కుమారు డున్మత్తుడై యున్నట్లు చంద్రాదేవికి వార్త జేరెను. అప్పటికి అతడు సుమారు యిరు వది మూడు వత్సరముల ప్రాయము గల్గియుండెను. భగవం తునియందు దీవ్ర ఆవేదన నొందుట లౌకికులు పిచ్చిగా భావింతురు. ఈ అనిత్యసుఖములకై ప్రాకులాడుట బ్రహ్మవేత్తలు

వెఱ్ఱియందురు. ఈ రెంటిలో నుత్తమము భగవదున్మాదము. భగవద్దర్శన కాంక్షతో దీవ్రసంతప్తమానసుడైన యీ రామకృష్ణుని పిచ్చి నివారింపజేయ మాతృదేవియగు చంద్రామణి అతనిని కామారిపుష్కరిణికి రావించెను. 'ఏతంపి చేత్వా పవజంతి ధీరా అనపేక్షినో సబ్బదుఃఖం పహాయ' ధీరులీ లోకపుతీరును ఎరింగి వైరాగ్యము నధిష్ఠించి, దుఃఖముల నతిక్రమించి, ముక్తి గాంతురు అను బుద్ధభగవానుని వాక్యసరణి మనరామకృష్ణుడు దక్షిణేశ్వరమును వీడి స్వగ్రామమున కరుదెంచినను, తన సహజధోరణిని విడువజాలడయ్యెను. ప్రపంచవిషయములనెల్ల నిర్లక్ష్యముగ ద్రోసియున్న కుమారుని గాంచి, మాతృహృదయము తల్లడిల్లి, కుమారునికి వివాహము గావించినగాని పిచ్చి కుదరదని భావించి, తన రెండవ కుమారుడైన రామేశ్వరునితో వధువుకై యూరూర గాలింపజొచ్చెను. ఈ విషయమును రామకృష్ణునికి దెలుపకుండ గోప్యముగ నుంచిరి. కాని వారి యత్నము సఫలము గాదయ్యెను. ఎచ్చటను వధువును గాంచక దుఃఖితులై యున్న తన తల్లిని, ఆవిషయమును గ్రహించియున్న మన రామకృష్ణుడు జేరి, సర్వమును మాతృరూపమున గాంచు తనకు వివాహమేమిటి యని గ్రహించియున్నను, 'న మాతుః పరదైవతం'. తల్లికంటె నన్యదైవము లేదను భక్తిచే 'అమ్మా! మీరేల ప్రదేశముల ద్రిమ్మరుట? నాకొరకు నిర్ణీతమైయున్న బాలిక యిటకు నాలుగుమైళ్ళ దూరమునగల జయరామవటీ గ్రామమున రామచంద్ర ముఖోపాధ్యాయుని గృహమున జనించియున్నది. అటకు వెడలిన మీకార్య సాఫల్యము గలుగును' అని వచింప,

వారు అట కరిగి విచారించిరి. భవిష్యజ్జీవితమున దన విశాల ప్రేమతత్వముచే సర్వులకు మాతృదేవతగా జెలువొందు శారదామణీదేవి పంచవర్షప్రాయమై యుండుట వారు గాంచిరి. సంబంధమును నిర్ణయించి 1859 వ సంవత్సరమున వారిరువురకు పరిణయము గావించిరి.

పసితనముచే ప్రపంచ మననేమియో ఎరుగని శారదామణికిని, భగవద్దర్శనాకాంక్షచే ప్రపంచమును గ్రహింపజాలని మన రామకృష్ణునకును వివాహమగుటచే వారి సంబంధముగూడ ప్రపంచాతీతమై అలౌకికముగ ప్రపంచాదర్శముగ రూపొందెను. సమస్త స్త్రీలోకమును మాతృరూపమున గాంచు రామకృష్ణుడు శారదామణియందుగూడ మాతృత్వమునే గాంచి, షోడశీపూజలనుగూడ నామెకు నొనరించి, ఆమెను గౌరవస్థానమునసేగాక పూజ్యస్థానమున నుంచెను. ఇక మన శారదామణి యన్ననో తంత్రానుభూతియేగాక, అతిశయించిన పవిత్రత మూర్తీభవింప, వ్యావహారిక భర్తయు, పురుషుడునగు మన పరమహంసయందు పురుషత్వము నావలకుద్రోసి, స్త్రీత్వమునే ఆపాదింపజేసికొని, తన మాతృదేవిగా మన పరమహంసను గాంచుచు, గురువుగ, దైవముగ గౌరవించి, పూజించి, తరించెను. వారిరువు రేకాంతవాసమున నున్నను, మాతాపుత్ర సంబంధమే తాండవింప గామలేశముగూడ గోచరము కాదు. పరమహంస దివ్యానందవిభూతి నవగాహనము జేసికొని, దక్షిణేశ్వరముననే నివసించుచు, దన నిష్కల్మష పవిత్ర విశాల మాతృప్రేమచే నామె తనను జేరు భక్తకోటికేగాక, సర్వ జీవలోకమునకు బరమపవిత్ర మాతృదేవియై విలసిల్లి, తన

యమానుష అనంత సాధనాపటిమచే నాధ్యాత్మిక దివ్యశక్తిచే నితరులకు సంకల్పమాత్రమున ముక్తినొసంగుచు శ్రీశారదామణీదేవి విరాజిల్లినది. అందుచేతనే పరమహంస మహాసమాధి యనంతరము ఆ గురుపీఠము నధిష్ఠించి, భక్తుల కుపదేశముల నొసంగుచు, 'అమ్మా' అని యర్థించువారికి గల్పతరువై, తన నాశ్రయించినవారి పాప సంచయమునుగూడ ప్రేమతో గ్రహించి, వ్యాధిగ్రస్థయై, ప్రపంచ దుఃఖితులశాంతికై తన యసువులకూడ లెక్కసేయని ప్రేమహృదయ, ప్రేమనిధి శ్రీశారదామాయియై తన రొందుటకు గారణము శ్రీపరమహంస వినిర్మల ప్రేమ హృదయమే!

## శిష్య వర్గము

ప్రపంచమున సాగరమునకైనను నొక యవధి గాంచ నగునుగాని ఆధ్యాత్మిక జ్ఞానామృతాస్వాదనాసక్తుల నిస్స్వార్థ నిర్మల! ప్రేమోదధికిమాత్రము ఎట్టి యవధియు గానరాదు. వారి హృదయమున నా ప్రేమ చిన్న పిల్లకాలువచందము నొప్పుచు, బ్రహ్మానందము నాస్వాదించుకొలది విశాలమగుచు, ఉప్పొంగుచు, నంతరమున మనజాలక బహిర్గతమై, సర్వదిక్కుల నావరించి, సకలమును తరింపజేయక వెనుదిరుగదు. అట్టి ప్రేమను వర్ణింప నేరికగును? అట్టి ప్రేమయే సర్వుల దరిజేర్చునది. ఆ ప్రేమయే శిష్య శ్రేయోదాయకమైనది. ఆ ప్రేమయే యార్త్యానూయల రూపుమాపునది. ఆ నిష్కళంక, నిర్మల ప్రేమయే ఆధ్యాత్మిక తృష్ణను దృప్తిపరచునది. ఆ ప్రేమయే

పారమార్థికాభివృద్ధి నొసంగునది. ఆ ప్రేమయే దివ్యాధ్యాత్మికానుభూతుల నాస్వాదింపజేయునది. ఆ ప్రేమయే పరస్పర ప్రేమమున నేకసూత్రాటిపై నడుపునది. ఆ ప్రేమయే ఆధ్యాత్మిక సింహాసనాధిష్ఠుని జేయునది. ఆ ప్రేమయే 'యా దేవీ సర్వభూతేషు ప్రేమరూపేణ సంస్థితా' అను సప్తశతీ వచనానుసారము సర్వజగదాధారమునై యున్నది. అట్టి మధుర మంజుల ప్రశాంత దివ్యప్రేమతత్పరుడై, శ్రీ విశ్వేశ్వరీపాదపద్మారాధనామగ్నుడై, స్వాధీన సకలానుభవకోటి సంశోభితుడైన శ్రీ పరమహంసదేవుని విశాలప్రేమ పండిత పామరులను, స్త్రీ పురుషులను, ధనిక దరిద్రులను, గృహస్థ సన్న్యాసులను, సామాన్య అసామాన్యులను, గురు శిష్యులను, ఉత్తమాధములను, ద్వైత అద్వైతులను, సజ్జన దుర్జనులను, పూర్వాధునికముల జొచ్చి, ఎవరి నే యే రీతుల బరిణమింపజేసి, ఎట్టి ఉత్కృష్టాదర్శము నొసంగి, సర్వాదర్శమయ్యెనో సుమంత గ్రహించి ఆ ప్రేమ మాధుర్యాతిశయమున నీదులాడెదముగాక !

## శ్రీ వివేకానంద స్వామి

ఇట్టి అసాధారణ పవిత్రమూర్తుల నాశ్రయించి, తరించి, లోకాదర్శముగానైన భక్తకోటి విషయమున కాశ్చర్యమేమి ? వారు అసమాన ప్రతిభాస్వరూపులై, సాటిలేని సన్న్యాసచక్రవర్తులై చెలంగి ధన్యులైరి. వారిలో గొందరు ముఖ్యుల మాత్రము మనము గ్రహించుట అత్యావశ్యకము. దత్తవంశసముద్భూతుడై, విద్యాధికుడై, విషయలంపటముల

దగులొ్కనక, వాని సమూలముగ నంత మొందించి, ఈశ్వర సాక్షాత్కార పిపాసచే నసంఖ్యాక సంఘముల వ్యక్తుల నాశ్రయించి, ఎచ్చటను దనను దృప్తిపరచువారి గాంచక, నిరాశామూలమున దపించి, పిమ్మట దక్షిణేశ్వరమునగల సాధుసత్తముడు భగవంతుని దర్శించినవాడనియు, మహిత త్యాగమూర్తియనియు, బంధువగు రామచంద్ర దత్తునిద్వార గ్రహించి, అధిక ఆవేదనాతప్త హృదయుడై దక్షిణేశ్వరమున కరిగి, శ్రీరామకృష్ణుని నిర్మలప్రేమపూరిత శీతకిరణ సందోహముచే శాంతి నొంది, మన రామకృష్ణుని గ్రహించి, అతని అడుగుజాడల ననుసరించి, నతని గురువుగ స్వీకరించి, 'నాస్తి తత్త్వం గురోః పరం' గురువుకంటె బరమే లేదను చందముగ సర్వము శ్రీ గురుదేవుడే యని విశ్వసించి, ఆ యతివరేణ్యు కృపా విశేషమున నిర్వికల్పాది సమాధులగూడ జవిజూచి, అతని యనంతరము సర్వలౌకిక సంబంధముల ద్రెంచి, 'సన్న్యాసః శిరసి స్థితః' శిరోభూషణమును, ఆశ్రమ రాజమును అగు సన్న్యాసమును స్వీకరించి, శ్రీ వివేకానంద నామమున బ్రఖ్యాతుడై, శ్రోత్రియత్వముచేతను, అనుభవముచేతను, ప్రాచీనాధునిక విజ్ఞానప్రవాహము నేకము గావించి, విదేశముల దన వాగ్ఝరిచే వేదాంతమతమును బ్రతిష్ఠించి, స్వదేశ పరదేశీయులచే సంస్తుతిపాత్రుడై, భూత భవిష్య ద్వర్తమానముల నసాధారణ కీర్తిగడించిన శ్రీ వివేకానంద నామక యతికుల సార్వభౌముడే శ్రీపరమహంసదేవుని ప్రథమశిష్యుడు. శ్రీవివేకానందుడు మన పరమహంస పాదసరోరుహముల నాశ్రయించి, 'తేషాం తేజో విశేషేణ ప్రత్యవాయో న విద్యతే' వారి ప్రకాశ విశేష

ముచే నఘపుంజము అడంగి పోవును అను స్మృతివాక్య విధానమున పాప విమోచనుడై జన్మసార్థకతను గడించి, తా ధన్యుడగుటయేగాక, దన వంశము, పరిసరములు, దేశము, ప్రపంచములకుగూడ ధన్యత గలుగజేసెను. ఆహా! పసితనమునుండి ప్రాపంచిక జీవితము నొల్లక భగవంతునికై తపించు వారికి గదా సర్వాధ్యాత్మిక సంస్థితులు లభ్యము! అసాధ్యములు సాధ్యము లగుట వారికేగదా! భగవంతుడు వారికి గరతలామలకము గదా! శ్రీ వివేకానందుని జీవిత మాహాత్మ్యమును 'మన వివేకానందుడు' అను గ్రంథమున జూచెదరుగాక.

## శ్రీ బ్రహ్మానంద స్వామి

శాక్తేయుడును, జమీందారును అగు ఆనందమోహన్ ఘోషునకు 1863 లో గలకత్తానగరమున రాఖాల్ చంద్ర ఘోష్ జనన మొందెను. చిన్ననాటనుండియు భగవద్విషయముల నధిక యాసక్తి గలిగియుండుటచే విద్యాభ్యాస మొనర్చుచు బ్రహ్మసమాజముచే నాకర్షితుడయ్యెను. అట సాధనల గావించుచు దృప్తినొంద జాలకుండెను. పదునైనవ వత్సరమున వివాహమాడినను నాతడింద్రియనిగ్రహము గలిగి జిజ్ఞాసువై యుండగలిగెను. అంత శ్రీరామకృష్ణ సాన్నిధ్యమును బడసిన యతడు, గురూపదేశముచే ననేక సాధనల నొనర్చుచు, దినమున బదునెనిమిది గంటలకాలము ధ్యానమున నుండుచు, అనుభవానందముల మగ్నతబొందుచు శ్రీ జగద్గురు మానసపుత్రుడు నా చెల్వొందెను. అంతియగాక

'రాఖల్ రాజ్యపాలనము జేయ సమర్థు'డని శ్రీ పరమహంసచే వచింపబడిన మన రాఖల్ చంద్రుడు, మధుర ప్రవర్తనము, అపార విజ్ఞానము, ఎనలేని తితీక్ష, అంతర్దృష్టి, శాంత్యాది సద్గుణములచే సోదర శిష్యుల ప్రేమను జూరగొనెను. మరియు నతడు శ్రీ జగద్గురుని దండ్రివలె ప్రేమించుచు, గురునిర్యాణ పర్యంతము విశేషభక్తి శ్రద్ధల నధిక సేవలనొనర్చి, గురు మహా సమాధి అనంతరము సర్వమును బరిత్యజించి శ్రీ బ్రహ్మానంద స్వామి యయ్యెను. దినమున పదునెనిమిది గంటలకాలము బ్రహ్మానుభూతిలో నుండు నీ త్యాగధనునకు బ్రహ్మానంద నామధేయ మెంతయు సార్థకముగదా! అంత మన స్వామియు బరివ్రాజకుడై, దేశముల గ్రుమ్మరి, భిక్షాచర్యముచేయుచు, బృందావనము, పూరీ మున్నగు బుణ్యక్షేత్రముల దీవ్ర సాధనల గావించుచు గొంతకాలమునకు మరల గలకత్తకు విచ్చేసెను.

నాటికే పాశ్చాత్యదేశమున జోహారుల నందుకొనుచున్న వివేకానందుడు, బ్రహ్మానందుని గలకత్తారాకను సోదరుల ద్వారా తెలిసికొని, కడుంగడు ముదమంది, ఆశ్రమ నిర్వాహణ పద్ధతుల నుత్తరముల మూలమున బ్రహ్మానందునికి దెలియ బరచుచుండెను. బ్రహ్మానందుడును ఆ యా విధానముల సక్రమ రీతి గ్రహించి, వాని నాచరణమున నిడుచుండెను. శిష్య శిక్షణమున నతని కతడే సాటి. శ్రీపరమహంస వాక్యములు యథార్థములు గాకుండునా! అందుచేతనే వివేకానందునిచే నాప్యాయముగ 'రాజా' యనియు, తదితరులచే 'రాజా మహారాజ్' యని పిలువబడు మన బ్రహ్మానందస్వామి ప్రథమమున

శ్రీ రామకృష్ణ మఠమునకు ప్రథమాధ్యక్ష పదవిని స్వీకరించుట ఎంతయో సముచితమై యొప్పుచున్నది. జన్మతః నాయక లక్షణోపేతుడై, ప్రపంచము నుద్ధరింపగల వ్యక్తి వివేకానందుడైనచో, అగాధ దివ్యాధ్యాత్మిక శక్తిస్వరూపుడై, ఆ శక్తిచే సర్వవిశ్వమును నియమించు శక్తి సామర్థ్యములుగల వ్యక్తి బ్రహ్మానందుడు. లేనిచో శ్రీ పరమహంస మానస పుత్రుడనుట సాధ్యమా? మఠమున వసించుచు, శిష్యులకు క్రమశిక్షణము నొసంగుచు, వారిచే సాధనల జేయించుచు, మఠవిషయముల జాగరూకుడై మన స్వామి యున్నను తన ధ్యానాదికముల గావించుకొనుచుండెను. 1908 లో మద్రాసు శ్రీరామకృష్ణ మఠ అధ్యక్షుడగు శ్రీరామకృష్ణానందుని ఆహ్వానముపై అటకేగి, అంత గొన్ని క్షేత్రములదర్శించి, ఎచ్చటకు వెడలినను అపార గౌరవాదరముల నొందిన బ్రహ్మానందస్వామి జగద్వంద్యుడై 1921 ఏప్రిల్ మాసమున బ్రహ్మసాయుజ్యమును బొందెను.

## శ్రీ శారదానంద స్వామి

దానధర్మశీలురును, సత్యనిష్ఠులును, భగవద్విశ్వాస యుక్తులును, తంత్ర శాస్త్రానుచరులునగు ధనిక బ్రాహ్మణ కుటుంబమున 1865 లో శరచ్చంద్ర చక్రవర్తి ఉద్భవించెను. జనకుయొనర్చు బూజాదికముల వీక్షించిన నీ బాలుడు యధిక భక్తి శ్రద్ధల దానును అర్చనల గావించువాడు. రోగులకు, పేద లకు సహాయభూతుడగుచు, మాటచేనైన బరుల మనస్సును

నొప్పింపజాలని మృదుహృదయుడైన యీతడు ఆధ్యాత్మికా కాంక్షచే నాడు పేరెన్నికగనిన బ్రహ్మసమాజమున జేరియు, సాధనల గావించినను తృప్తి గాంచలేకుండెను. పిమ్మట నతడు 1883 వ సంవత్సరమున శశిభూషణ చక్రవర్తితో దక్షిణేశ్వర సాధువర్యుడైన శ్రీరామకృష్ణ గురుదేవుని సందర్శించి, 'వివాహమే బంధకారణ' మను శ్రీరామకృష్ణ త్యాగమయవాక్కులచే నుత్తేజితుడై, మిత్ర బంధు జననీ జనకులకంటె గురుదేవుని ప్రేమను నిర్మలముగ గ్రహించి, దానికి గట్టువడి, ఓర్పు, నిశ్చలత, దయాపరత్వబుద్ధి మున్నగు సుగుణములచే గురుదేవుని ప్రేమకు బాత్రుడై, గుర్వాజ్ఞానుసారియై సాధనల సాగించుచుండెను. భావిజీవిత నాయకుడగు నరేంద్రుని గుణగణములచే నాకర్షితుడైన యీతడు విద్యయందభిలాష లేకున్నను నరేంద్రుని ప్రోత్సాహమున వైద్య కళాశాలలో జేరెను. కాని శ్రీరామ కృష్ణుని వ్యాధిసమయమున సర్వసేవల నొనర్చి, శ్రీరామకృష్ణుని శరీరత్యాగానంతరము బారానగర్ చేరి, సన్న్యసించి శ్రీ శారదా నంద స్వామి అను నామధారి యయ్యెను.

అంత నతడు దీర్ఘయాత్రల జేయుచు, తపోనిష్ఠుడై వెల యుచు 1891 లో గలకత్తకు ఏతెంచెను. పిదప 1896 లో పాశ్చాత్య ఖండముననున్న వివేకానందునిచే శారదానందు డాహూతుడై, అటకేగి, సోదరుని యాజ్ఞల పాలించి, అనేక ఆధ్యాత్మిక ప్రసంగములచే నచ్చటివారిని ముగ్ధుల గావించెను. 1898 బేలూరు శ్రీ రామకృష్ణ మఠస్థాపనమున శ్రీ వివేకా నందుని పనుపున శారదానందస్వామి సర్వకార్యదర్శియై యొప్పారెను. మరియు నీతడు గలకత్తయందు 'ఉద్బోధన్'

అను వంగభాష పత్రికను నిర్వహించుచు, గురుతుల్యయగు శ్రీ శారదామాయి అనుగ్రహపాత్రుడై, తన మాతృభక్తి జిహ్వామో యనునట్లు 1923 వ సంవత్సరమున శ్రీ శారదా జన్మ భూమియగు జయరామవటియందు సుందరమగు నొక దేవా లయమును నిర్మించి నిగర్వచూడామణియై వెలుగొందెను. గ్రంథరచయితగను, ఉత్తమ వక్తగను రూపొందియున్న యీ స్వామి గాఢ గురుభక్తి తత్పరుడై, తనను పరమహంస హస్త మునగల ఉపకరణముగ మాత్రమే భావించుకొనుచు, సోదరు లలో నగ్రగణ్యుడును, నాయకోత్తముడు నగు వివేకానందుని యొక్క సేవకునిగ దలంచుకొనుచు, శ్రీ శారదా రామకృష్ణుల ప్రేమ ప్రవాహద్వయ మీతని హృదయమున నేకత్వము నొంద, సర్వుల దన ప్రేమవాత్సల్యముల ముంచుచు, దన కార్య నిర్వహణానంతరము 1927 ఆగస్టున నీ స్థూల శరీరమును బరిత్యజించి సత్యజ్ఞానానందస్వరూప బ్రహ్మమున విలీనమయ్యెను. మన శారదానందస్వామి జీవిత విశేషము లత్యద్భుతములు.

## శ్రీ యోగానంద స్వామి

మరియు, భగవచ్చింతనాపరుడగుటచే శ్రీరామకృష్ణునకు బరిచయుడైన నవీనచంద్ర చౌధురి అను బ్రాహ్మణోత్తముని గృహమున 1861 లో జనించిన జోగేంద్రనాథ్ చౌధురి బాల్య మాదిగ నేకాంతమున ధ్యానముల మునుంగుచు, నాటపాటల యందకస్మాత్తుగ నాకసముదెస బరికించి, 'నేను యీ లోక మునకు సంబంధించినవాడనుగాను. ఊర్ధ్వలోకమునుండి అరు

దెంచితి' నని యోచనారతి నుండువాడు. ఇతడు మృదుహృదయుడే కాని విమర్శనాశీలుడు. 16,17 వత్సర ప్రాయమున నితడు శ్రీరామకృష్ణుని బ్రథమమున దర్శించి, గురుదేవుని దన విమర్శనాబుద్ధిచే నిశితముగ బరిశీలించి, ఆయనయం దెట్టి దోషములగాంచక దన జీవితమునే ఆ మహనీయుని కర్పణము గావించుకొనెను. అంత శ్రీ గురుదేవుని బోధల నాలకించి, సాధనాధుల మునుంగుచున్న జోగేంద్రుడు, దల్లి బలవంతముచే బరిణయమాడియు సాంసారిక విషయముల బ్రవేశింపడయ్యెను. శ్రీరామకృష్ణుని సర్వాదర్శత్యాగమును మది బలుమారు భావించుచు, అందలి యుత్కృష్టతను గ్రహించిన జోగేంద్రుడు తన వైవాహిక జీవితమునుగూర్చి జింతించి, తన జీవితము వ్యర్థమయ్యెనని క్రుంగి, త్యాగజీవనమునే ప్రధానముగా గలిగిన శ్రీరామకృష్ణునిచెంత కరుగుటకు సాహసింపడయ్యెను. కాని శ్రీరామకృష్ణుని శిష్యవాత్సల్య మా యువకుని దక్షిణేశ్వరమునకు రప్పించెను. శిష్యుని రాకను గమనించిన ప్రేమమూర్తి గురువరేణ్యుడు, శిష్యుని లాలించి, 'జోగిన్! నీ ఆధ్యాత్మిక జీవితమునకు వివాహ మాటంకము కానేరదు. ఇట్టి వెయ్యి వివాహములైనను అవి నీ పారమార్థికాభివృద్ధి నేమియు జేయజాలవు. మరియు నీ భార్య నిటకు గొనిరమ్ము. ఆమెను నీకు సహాయకారిగ నొనర్తు'నని అతనియందు నిగూఢమైయున్న ఆధ్యాత్మిక శక్తిని దెలియజేసి, ధైర్యోత్సాహములనిడి, తన అభయహస్తము నొసంగి, ఆతని హృదయగత బాధను నివారించెను. గురునామము యిట్టి సమయములనే గదా అన్వయము! నాటనుండి మన జోగేంద్రనాథుడు గురుసేవారతుడై 'ఒక్క-

గురుదేవునిదే యథార్థప్రేమ. అన్యులప్రేమ స్వార్థ'మని మనసా గ్రహించి, గురు శిక్షణముచే సాధనల గావించి అనుభవసంపేతుడై యలరారెను. తర్వాత త్యాగపూరితుడై శ్రీ యోగానందస్వామియై ధన్యతగాంచెను. శ్రీ శారదామాయితో దీర్ఘ యాత్రలజేసి, ఆమెచే నుపదేశమునొందిన మన యోగానందుడు ప్రథమమునుండియు నీ సంఘముల, నేతత్కాల్యకలాపములకు దూరముగానుండుచు, ప్రతి సంవత్సరము శ్రీరామకృష్ణ జయంత్యుత్సవములమాత్రము నిర్వహించుచు, సాధనాదుల దీవ్రముగ నొనర్చుచు, 1899 మార్చిలో మహాసమాధి నొందెను. నిష్కపటియు, మృదుహృదయుడు, అనుభవసంపన్నుడగు నీ యోగానందుడే శ్రీ రామకృష్ణ శిష్యవర్గమున ప్రథమమున దేహమును చాలించిన వ్యక్తియగుటచే నీ సంఘటనమునకు సోదరశిష్యులెల్లరు చింతాక్రాంతులైరని వచింప నవసరములేదు.

## శ్రీ నిరంజనానంద స్వామి

కలకత్తా వాసియైన కాళీకృష్ణమిత్ర మేనమామ యగుటచే నిత్యనిరంజన ఘోష్ ఆతని గృహమున నివసించుచు విద్యాభ్యాసము జేయుచుండెను. నిష్కపటియై, దృఢశరీరుడై, సహజజీవితో నొప్పు నీ బాలుడు బాల్యమునుండియు ధైర్యస్థైర్యాదిక గుణములకు నెలవైయుండెను. అందుచే భూతప్రేత పిశాచాదుల నాహ్వానించువారితో స్నేహముచేయుచు, నతడు ఆపిశాచాదులగూర్చియే ఎల్లప్పుడు యోచించెడివాడు. ఇతడు

తన పదునేనిమిదవ వత్సరప్రాయమున ప్రథమమున శ్రీ రామకృష్ణ సద్గురువరేణ్యుని దర్శించెను. దర్పణము, ముందున్న వ్యక్తి యొక్క స్థూలశరీరమును ప్రతిబింబింపజేయుచందము మహాత్ముల హృదయమను దర్పణము వ్యక్తుల ఆంతరంగిక గుణగణముల దెలియజేయునుగదా! అట్టి వినిర్మల హృదయుడగు గురుదేవుడు ప్రథమసమాగమముననే ఆతని వీక్షించి 'నాయనా! ఎవడు సర్వవేళల భూతాదులగూర్చి జింతించునో వాడు ఆ భూతమే యగును. కాని భగవంతునిగూర్చి యోచించిన దేవుడగును. ఈ ద్వయమున నీవు దేనిని అనుసరింతువు?' అని ప్రశ్నించి 'ద్వితీయముసే వాంఛింతు' నను ఆ బాలుని సమాధానమును విని ఎంతయు తృప్తుడై ఆనందించెను. అది యథార్థమే గదా! 'విషయాన్ ధ్యాయవత శ్చిత్తం విషయేషు విషజ్జతే। మామనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే॥' విషయ ధ్యానమున నున్న చిత్తము విషయముల మునుంగుచున్నది. నన్ను స్మరించు మనస్సు నాయందే విలీనమగుచున్నదని భాగవతమును, 'బ్రహ్మైవాహామితి భావయే త్తద్రూపో భవతి' బ్రహ్మము నేనని భావించిన తద్రూపమే యగునని ముద్గలోపనిషత్తును, చిత్తానుగుణ్యముగనే ఫలితమని వచించియున్నవి. అంత గొంతకాలమునకు నిరంజనుడు రెండవపర్యాయము శ్రీ రామకృష్ణుని దర్శింపవచ్చెను. శ్రీ రామకృష్ణుడాతని రాక కెంతయు ముదమంది, ప్రేమమున నాబాలుని గౌగిలించి, పరితాపహృదయుడై 'నిరంజన్! దినములు గడచుచున్నవి. నీవు దైవ సాక్షాత్కారము నెప్పుడు పొందగలవు? భగవద్దర్శనము లేని జీవితమంతయు వ్యర్థమేసుమా! కాన త్వరితముగ దానికై

యత్నించి ధన్యతనొందు'మని శిష్యునిగంటె నధికతర ఆవేదన మును తాను పొంది, ఆతని బుద్ధిని సాధనాదుల కున్ముఖము గావించెను. తన కొరకా యవతారవరేణ్యుని యావేదనను గ్రహించిన నిరంజనుడు వివాహవిముఖుడై, గురుపుంగవుని దోడ్పాటుచే సాధనలయం దుత్తీర్ణుడై, తన ఉద్రేకతత్త్వమును నశింపజేసికొని, శ్రీ రామకృష్ణుని సేవించి, శ్రీ రామకృష్ణ దేవుడు శరీరమును త్యజించిన యనంతరము శ్రీ నిరంజనానంద స్వామిగా బరిణమించెను. దేశముల దిమ్మరుచు, బుణ్యక్షేత్ర మగు వారణాసిజేరి, అట మధూకరముచే జీవించుచు తపోదీక్ష నుండె మన నిరంజనానందుడు. శ్రీ శారదాదేవి సన్నిధి నీతడు పసిబాలునివలె మెలంగెడివాడు. పై విధమున సంఘ శ్రేయస్సా మియైన నిరంజనానందుడు 1904 మే నెలలో రోగగ్రస్తమగు నీ దేహమును వీడి బ్రహ్మసాయుజ్యమును బడసెను.

## శ్రీ రామకృష్ణానంద స్వామి

శిష్టాచార సంపన్నులగు బ్రాహ్మణవంశమున శశిభూషణ చక్రవర్తి 1863లో పుట్టెను. పసితనమాదిగ ధీకుశలుడై యున్న యీ బాలుడు సాహిత్య, తత్త్వశాస్త్ర, గణిత, ఆంగ్ల, సంస్కృతములయం దధిక యభిరుచిని గలిగియుండుచు విద్య నభ్యసించుచుండెను. ఇన్ని యున్నను లోన భగవదాకాంక్ష తీవ్రమైయొప్ప బ్రహ్మసమాజమున బ్రవేశించెను. అంతమాత్ర మున నతనికి తృప్తిగలుగక 1883 వ సంవత్సరమున అవతార వరేణ్యుడగు శ్రీరామకృష్ణుని దర్శనభాగ్యమును బొంది, ఆయనచే

'సాకార నిరాకారముల నేది నీకు అభీష్ట'మని ప్రశ్నింపబడెను. కాని యీ బాలుడు నిష్కపటముగ 'భగవదునికి యే దెలియుని నేను మీ కేమని సమాధానము నొసంగగలను' అని ప్రత్యుత్తరమొసంగ శ్రీరామకృష్ణు డద్దానికి అమితానందమును పొందెను. దక్షిణేశ్వరమున నొకసారి, గ్రంథపఠనమున మునిగి బాహ్యమును మరచిన శశినిగాంచి, అనుభవానందమూర్తియగు గురుదేవుడు 'శశీ! విద్యయందధికాసక్తి కూడదు. అట్లైనచో నీ భక్తి క్షీణమగునుసుమా!' యని శిష్యశ్రేయస్కామియై హెచ్చరింప, రామకృష్ణుని భావమును గ్రహించిన శశి వెంటనే ఆ గ్రంథముల గంగయందు బడవైచెను. అవును, 'అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణి మానవః। యో వై బ్రహ్మ న జానాతి దర్వీ పాకరసం యథా॥' సమస్త వస్తువులయం దుండినను గరిటె ఆ పదార్థముల రుచినిమాత్రము ఎరుంగజాలనట్లు మానవుడు జతుర్వేదముల, ధర్మశాస్త్రముల నధ్యయనము గావించి, బ్రహ్మమును గ్రహింపనిచో తత్తుల్యమనియే ఉత్తరగీతా వాక్యము. అంతట శశి శ్రీరామకృష్ణోపదేశముల స్వీకరించి, తదనుగుణముగ సాధనల నొనసాగించుచు, అనుభవముల బొందుచుండెను. శశి బి. ఎ. చదువుచున్న సమయమున శ్రీరామకృష్ణునికి వ్యాధి యంకురించెను. అంత నతడు చదువు సంధ్యల గాలదన్ని, సాధనల వర్జించి 'న స్నానేన న మౌనేన నైవాగ్ని పరిచర్యయా। బ్రహ్మచారీ దివం యాతి స యాతి గురుపూజనాత్॥' స్నాన మౌన అగ్నికార్యాదికములచే బ్రహ్మచారి స్వర్గమును జేరడు. కేవల గురుసేవవలననే యాత డుత్తమ

స్థితిని బొందునను శంఖధర్మశాస్త్రమురీతి సర్వము గురుసేవకే అంకితము చేసెను.

శ్రీరామకృష్ణనిర్యాణానంతరము తీవ్ర సాధనలలో మునిగి తేలుచున్న సోదర శిష్యుల భోజనసదుపాయముల జూచుచు, వారి సాధనల కనుకూలత నొసరించు నా నిర్మల మాతృప్రేమ విలసిత హృదయుడగు శశిభూషణుడు 'శశి మాకు తల్లి. కాల మును, భోజనాదుల విస్మరించి సాధనల నున్న మమ్ముల నాతడు బలవంతమున లేవదీసి ఆహారము నొసంగెడివాడు' అని వివేకానందునిచే ప్రేమింపబడుటజూడ ఆశ్చర్యము కలుగును. అట్టి పరస్పర ప్రేమానురాగములు శ్రీరామకృష్ణ పరమహంస దేవుని శిష్యులకుగాక అన్యులకు సాధ్యమా! అట శశి యత్యా శ్రమమును గొని, తనకు గురుదేవునియందుగల గాఢ భక్తి విశ్వాసములకు చిహ్నమో యనునట్లు శ్రీ రామకృష్ణానంద స్వామి నామము నిడికొనెను. బారానగర్ మఠముననే నివ సించుచు పూజాదుల నిర్వహించుచుండు రామకృష్ణానందుని, అతని గాఢ గురుభక్తియు, సునిశిత సూక్ష్మజ్ఞానము, ఆచరణ యుక్తములగు ప్రబోధ, అచంచల కార్యదీక్ష, తితిక్షాదుల ప్రపంచమునకు దెలియజేయుటకో యనునట్లు వివేకానందుడు 1897 లో మదరాసునగరమున శ్రీరామకృష్ణ మఠ స్థాపనార్థమై బంప సంకల్పించెను. నాయకుని ఆజ్ఞగొని, చెన్ననగరమును జేరెను. అచ్చట మన రామకృష్ణానంద స్వామి తన అతీత వైరాగ్యముచేతను, అగాధ ఆధ్యాత్మిక శక్తిచేతను, అపార శాస్త్ర పరిజ్ఞానముచేతను, సంస్కృతపాండిత్య ప్రకర్షచేతను సర్వుల నాకర్షించి, ప్రసంగములజేయుచు, ఉపన్యాసముల

నొసంగుచు, గ్రంథముల రచించుచు అచిరకాలమున విశేష కీర్తి నార్జించెను. సూక్ష్మబుద్ధియగు నీ స్వామి సుసూక్ష్మ విషయములగూడ నతితేలికగ వివరించుచు నెల్లర ముగ్ధుల గావించువాడు. అంతియగాక వేదాంత విషయములపై ననేక గ్రంథముల విరచించెను. భౌతిక శాస్త్ర Science తత్త్వశాస్త్రము Philosophy లాతనికి కరతలామలకమై అందలి సునిశిత భావము లాతని జిహ్వాగ్రమున నాట్యము సలుపుటయం దాశ్చర్యము లేదు. Science is the struggle of man in the outer world. Religion is the struggle of man in the inner world బాహ్యప్రపంచమున మానవుని పోరాటను భౌతిక శాస్త్రమనియు, అంతః ప్రపంచమున మానవుని పోరా టను మతజీవనమనియు భౌతిక-మత జీవితములను, మరియు Politics is the freedom of the senses, while religion is freedom from the senses ఇంద్రియ స్వాతంత్ర్యమే రాజకీయ ములనియు, ఇంద్రియములనుండి. స్వతంత్రతయే పారమార్థిక జీవనమనియు, రాజకీయ - మతజీవితముల రహస్యములను, ఒక్కమాటలో Religion begins where science ends భౌతిక శాస్త్ర పర్యవసానమున మత జీవనము ప్రారంభించునని అత్యద్భుతముగ విశదీకరించెను. అట్టి ధీశాలియయ్యు శ్రీ రామకృష్ణుని ప్రపత్తిమార్గమున శరణొందిన మహావ్యక్తి. బొంబాయి బెంగుళూరు, మైసూరు, బర్మాలలో ఉపన్యసించి, మతస్థాపనల గావించుచు, శాస్త్రోక్త సద్గుణములు గల వ్యక్తులమాత్రమే శిష్యులుగ జేర్చి, క్రమశిక్షణను నొసంగుచుండిన మన శ్రీ రామ

కృష్ణానందస్వామి తన సాధనాదులకు భంగములేక కార్య క్రమముల నెరవేర్చుచు, శ్రీ రామకృష్ణ సందేశముల దేశము నల్గడల బ్రసరింపజేసి, దేశమున పారమార్థిక బీజముల నాటి, గ్రంథముల, ప్రసంగముల, ఉపన్యాసములద్వారా విరివిగా వేదాంత ప్రచారమును సాగింపజేసిన నా అపూర్వ దివ్యమూర్తి తన జీవిత సర్వస్వమును బ్రపంచమునకు ధారవోసి, 1911 ఆగ స్టున 'అత్యంత మలినో దేహః' అను చందము యీ మలిన సంకుచిత దేహమును వీడి శ్రీ రామకృష్ణ పరబ్రహ్మమున లీనమయ్యెను.

## శ్రీ త్రిగుణాతీతానంద స్వామి

కలకత్తాపట్టణమున భగవదారాధనాపరులగు నొక ధనిక కుటుంబమున ధీశాలియై, సత్ప్రవర్తనుడై, సద్గుణముల పట్టు గొమ్మయై 1865 వ సంవత్సరమున శారదా ప్రసన్న మిత్ర జన్మించెను. బాల్యమునుండియు శాస్త్రపఠనాసక్తియు, దానికి మించిన మనన శక్తియు, నాతని సుగుణములు. ఈ బాలు డొకదినము తన బంగారపు చేతి గడియారమును బోగొట్టుకొని దిగులుజెంద, 'శ్రీరామకృష్ణ లీలా ప్రసంగ' గ్రంథకారుడును, ఉన్నత పాఠశాలా ప్రధానోపాధ్యాయుడునైన మహేంద్రనాథ గుప్త శ్రీరామకృష్ణ శిష్యుడగుటచే నీబాలుని మార్చుటకు శ్రీరామ కృష్ణుని సన్నిధికి గొంపోయెను. ఆ సాంగత్య మహిమచే శారదా ప్రసన్నునకు నాధ్యాత్మికాసక్తి అభివృద్ధినొందుటయు, బాహ్య విద్యల నశ్రద్ధయు గలుగ నాతని తల్లిదండ్రులు గాంచి, వివా

హాము నిశ్చయింప నీ బాలుడు జగన్నాథ క్షేత్రమునకు బారి పోయెను. అంత గొంతకాలమునకు మరల గలకత్తకు జేరి, శ్రీరామకృష్ణదేవుని సేవించి, గురు మహాసమాధి అనంతరము తురీయాశ్రమమును స్వీకరించి శ్రీత్రిగుణాతీతానంద స్వామియై విరాజిల్లెను. 1891 లో బృందావనము మధుర మున్నగు బుణ్య క్షేత్రముల దర్శించి, 1895 న కైలాస్ మానస సరోవరముల కేగి త్రిగుణాతీతుడు గలకత్తకు జేరి, శారదానందస్వామి స్థాపితమైన 'ఉద్బోధన్' పత్రికాధిపతియై, 1903 జనవరిలో అమెరికా కేగి అట వేదాంత ప్రచారము జేయసాగెను. ఇట్లు స్వామి తన తను మనముల గురుదేవుడగు శ్రీరామకృష్ణునికి యర్పించి, తత్సం బంధ కార్యముల నిర్వహించుచు, అహర్నిశముల దన సాధనల గావించుకొనుచు, శిష్య శిక్షణమున మంచి దిట్టయై చెలు వొందెను. ఇట్టి యీ మహాపురుషుడు 1914 డిశంబరు మాసమున, ఆశ్రమములో నొక సభ నేర్పాటుచేసి, దానికి వలయు సర్వసంభారములు సంసిద్ధమైనవేమో యని చూచుట కేగుదెంచిన సమయమున, స్వామి పూర్వపు విద్యార్థి యొకడు ఒక బాంబును విసరివేసెను. దానిచే స్వామి తీవ్రముగ గాయ పడియు, నా బాలునిపై నెట్టి కినుకయులేక బాలుని యోగ క్షేమముల నరసి మిగుల యానందించెను. మరియు నతని కెవ్విధమైన అపకారము నొనర్పరాదని గట్టడి చేసెను. ఏమి యా ప్రేమవాత్సల్యములు ! ప్రేమించువారిని ప్రేమించుట గాన నగుగాని ద్వేషించువారిని ప్రేమించుట లోకమున గాంచగల్గు దుమా ! పరులనుండి దేని నాశించినను యిట్టి వినిర్మల ప్రేమ గలుగదు. నిరాశాపరునకే ఆ ప్రేమ లభ్యముకాని అన్యులకు

దుర్లభము. అట్టి ప్రేమరాశియే శ్రీరామకృష్ణదేవుని శిష్యుడన జెల్లునుగాని లేకున్న కాదు. అప్పుడు శిష్యులు స్వామికి చికిత్స నేర్పాటు గావించియుండిరి. ఔషధములు సేవించుచున్నను స్వామికి ఆరోగ్యము చేకూరదయ్యెను. ఈ శరీరముపై విరక్తి జనించెనో యను విధానమున మన స్వామి ఆశ్రమవాసులను జేరబిలిచి 'రేపు శ్రీవివేకానంద స్వామి పుణ్య జన్మదినము. కాన నే నీ దేహమును బరిత్యజింతు' నని వారికి దెలియజేసి, 1915 జనవరి 10 వ తేదీ ఉదయమున, శ్రీ వివేకానంద పుట్టిన దినమున, అసువుల బాసి, శిష్యవర్గమును దుఃఖోదధి ముంచి శ్రీరామకృష్ణ గురుసన్నిధి జేరెను.

## శ్రీ ప్రేమానంద స్వామి

హుగ్లీ జిల్లా అంత్‌పూర్‌లో దయాస్వరూపులును, భక్తాగ్రగణ్యులునగు తారాప్రసన్న ఘోష్, మాతంగినీదాసి యను దంపతుల గర్భవాసమున, కాయస్థ వంశమున, 1961 వ సంవత్సరమున బాబూరాం ఘోష్ ద్వితీయ పుత్రుడుగ బుట్టెను. కొలదిగ మాటల నేర్చిననాటనుండి యీ బాలుడు పూర్వజన్మ సుకృతమో యనునట్లు వివాహమును గూర్చి ప్రసంగించువారలతో 'వివాహము వలదు. అట్లయినచో మరణింతు' నని వివాహము నేవగించుకొనుచుండెడివాడు. బాల్యమునుండియు నాధ్యాత్మిక చింతనాసక్తి గలవాడగుటచే నీతడు తన సోదరుడగు తులసీరాం ఘోష్ ద్వారా శ్రీ రామకృష్ణుని జీవితవిశేషముల వినుట దటస్థించెను. మరియు దన

సహాధ్యాయింటగు రాఖల్ చంద్ర ఘోష్‌కూడ శ్రీ రామకృష్ణు సన్నిహితుడగుటచే ననేక విషయముల నాలకించిన బాబూ రాం మనస్సు దక్షిణేశ్వరము వెడలుటకు నారాటమొంద సాగెను. అంత నొక దినమున బాబూరాం రాఖల్‌తో శ్రీరామకృష్ణుని జూడ నేగెను. నాటికే బాలునికి ఇరువది వత్స రముల ప్రాయము. శ్రీ రామకృష్ణ దేవుడును రాఖల్ వెంట నుండు బాబూరామ్‌ను పిలిచి, ఆతని తల్లిదండ్రులగూర్చి ప్రశ్నించెను. అంతటితో దృప్తిగాంచక శ్రీ రామకృష్ణు డా యువకుని, దగ్గరకు జేరబిలిచి, ఆతని ముఖమును, హస్తము లను, బాదములను వీక్షించి పారమార్థిక జీవితమునకు దగిన వ్యక్తిగా నిశ్చయించి ముదమొందెను. పిమ్మట ద్వితీయపర్యాయ మతడు శ్రీ రామకృష్ణుని దర్శింప, నరేంద్రనాథునిగూర్చి విని నరేంద్రుని గలిసికొని మిక్కిలి సంతసించెను. అంత దరుచు శ్రీ రామకృష్ణుని చెంతకు జనుచుండు నీ యువకుడు నిస్స్వార్థ, పవిత్రతలతో నుండు శ్రీ రామకృష్ణదేవుని ప్రేమకును, స్వార్థ పూరితమును, కల్మషయుక్తమునగు లౌకికుల ప్రేమకునుగల వ్యత్యాసముల గ్రహించి, గురుదేవుని ప్రేమకు దన జనని ప్రేమకూడ సాటిరానిదని విశ్వసించి, ఆ ప్రేమోదధి గ్రుంకుచు, గురు ప్రబోధితుడై, సాధనలజేయుచు, గుర్వనుగ్రహ ప్రసార ముచే సాధనాటంకముల నిర్మూలనము గావించుకొని, ఆనం దానుభూతి నోలలాడ దీవ్ర గృషి సల్పుచుండెను. ప్రపంచ కల్మషములు లేని పవిత్ర హృదయుడగుటచే నీతడు శ్రీ రామ కృష్ణదేవుని సమాధ్యవస్థల నాయన కెట్టి అపాయము రానీయక అండగా నుండెడివాడు. ఏ లేశమాత్ర దోషము పరుల నున్నను,

శ్రీ రామకృష్ణ దేవుడు సమాధిసమయముల వారి స్పర్శను సహింపజాలడు. కాన వీనివలన ఈతడెట్టి నిర్మలుడో మనకు వ్యక్తమగుచున్నది. శ్రీ రామకృష్ణ దేవుని వ్యాధిలో శుశ్రూషల గావించుచు, ఆ ప్రేమమూర్తి అస్తమింప నీయువకుడును, ప్రాపంచికవిషయముల గాలదన్ని, గురుదేవుని ఆదర్శముగగొని, సర్వమును ద్యజించి శ్రీ ప్రేమానంద స్వామి యను నామధారి యయ్యెను. పరివ్రాజక జీవితమున నుండుచు, సాధనలజేయుచు గొంతకాలమునకు మఠమునకు జేరెను. శ్రీ వివేకానందుని మరణానంతరము మఠ కార్యక్రమముల నతి శ్రద్ధమై నిర్వహించెడివాడు. పవిత్రత రూపొందిన ఆతని మూర్తి మత్త్వము, ప్రేమనిలయమగు నాతని హృదయము, హృదయమే బహిర్గతమై ప్రవహించుచున్నదో యనునట్లుండు నాతని వచనములు, ప్రేమను జిందించు నాతని చూడ్కులు ఎట్టివాన్నినైన గాఢాక్రాంతుని జేయక మానవు. సాశ్రునేత్రుడై వాక్కుచేగాక హృదయముతో బోధించును. సన్న్యాసిసోదర బృందముపై నాతని ప్రేమ అత్యద్భుతము, అమానుషము. శిష్యులపై నాతని ప్రేమవాత్సల్యములమోఘములు. అనవరత మాతడు సోదరశిష్యుల ఆరోగ్యమును అభివృద్ధినే గాంక్షించు ఉదారహృదయుడు. ఇట్టి ప్రేమస్వరూపుడు 1918 జులై మాసమున నీ స్థూల శరీరమును బాసి 'న స పునరావర్తతే' అను శ్రుత్యుక్తముగ బునర్జన్మ రహిత మోక్షమున బ్రవేశించెను.

## శ్రీ అద్భుతానంద స్వామి

బీహారుదేశమున నొక నిరుపేద కుటుంబమున జనన మొంది, 6 వ వత్సర ప్రాయమున జననీ జనకులు మరణింప, దగ్గర బంధువొకనిచే గలకత్తకు దీసికొనిరాబడిన బాలుడు గత్తురాం లేక లాటూ. 9, 10 వత్సరములు వచ్చుటతో నా బాలుని యాతని బంధువు ఒకరి గృహమున సేవకునిగా నియమించెను. శ్రీరామకృష్ణ గురుదేవుని పాదసన్నిధి జేరి, గురుదేవుని అమూల్య త్యాగమును దన జీవితమున మేళవింపజేసికొని, గురు వచనముల వేదవాక్కులుగ స్వీకరించి, వాని జీవితమున ననుష్ఠించి, శ్రీరామకృష్ణ పరమహంస దేవుని గృహస్థ శిష్యులలో నాదర్శ వ్యక్తియై చెలువొందిన రామచంద్రదత్తయే ఆగృహస్థు. అట్టి పరమ భక్తుని గృహమున మనలాటూ సేవకుడు. అదియే భగవదనుగ్రహము. ఎవరి యభివృద్ధికి ఏది ఎట్లు సమకూడునో దెలియరాదుగదా! బాల్యమునుండియు మన లాటూ ఎచ్చటనైన సంకీర్తనము నాలకించినచో దానిచే నాకర్షితుడై, చేయు పనుల విస్మరించి అచ్చట కేగెడివాడు. బాలుడైనను ఆ సల్లక్షణములగాంచి రామచంద్రదత్త కుటుంబమువారును లాటూ నధికముగ ప్రేమించెడివారు. ఆ బాలుని సత్యానిరతికి వారు ఆనందించెడివారు. శ్రీరామకృష్ణుని భక్తుడగు రామచంద్ర దత్తుని పవిత్ర ప్రవర్తనము, ఆతని పవిత్ర గృహవాతావరణము, గృహమునందలి భక్తి సంభరిత సంభాషణములు లాటూ యొక్క అభివృద్ధికి సహాయభూతము లగుచుండెను. అంతియు గాక నన్నిటిగంటె నీ బాలునకు శ్రీరామకృష్ణ దేవునకు గలిగిన సంబంధమే యిట ముఖ్యము. ఈ బాలునిచే రామచంద్ర

కుటుంబమువారు శ్రీరామకృష్ణ దేవునకు ఫలాహారముల దక్షి ణేశ్వరమునకు బంపెడివారు. వాని నటకు గొంపోయిన లాటూ శ్రీరామకృష్ణుని గాంచి, ఏదియో తెలియని ఆకర్షణమున మునింగి, అవ్యక్తమగు నానందము ననుభవింపసాగెను. ఒక పర్యాయము శ్రీరామకృష్ణుడు తన జన్మభూమియగు కమార్పు కూరునకు వెడల లాటూ దక్షిణేశ్వరమున కేగి తల్లిని బాసిన శిశువుచందమున విలపించుచు నావేదన మొందెను. శ్రీరామ కృష్ణుడు దక్షిణేశ్వరమున కేతెంచుతోడ లాటూకు శ్రీరామ కృష్ణ సాంగత్యమధికమై, తత్ప్రభావమున నాతని సన్నిధినుండ నాయమాయక హృదయము గాంక్షించెను. అంత నొకనాడు లాటూ మెల్లన తన యజమాని యగు రామచంద్రుని జేరి తన గోరికను నివేదించెను. రామచంద్రుడును దక్షిణేశ్వరమున రామకృష్ణుని దర్శింప 'లాటూను ఇక్కడనే ఉండనిమ్ము. నిర్మల హృదయుడు' అని శ్రీరామకృష్ణుడును దనతోడ బలుక నాతడు వల్లెయని యంగీకరించెను.

నాటనుండి మన లాటూ శ్రీ రామకృష్ణ పాదసన్నిధిని వసించుచు, గురుబోధల నాలకించుచు, సంశయ రహితుడై తీవ్రసాధనల మునుంగుచు, గురువిశ్వాసముచే విద్యాగంధము లేవివాడయ్యును అనుభవానందమూర్తియై యొప్పి, శ్రీ రామ కృష్ణ నిర్యాణానంతరము శ్రీ అద్భుతానంద స్వామియై చెలు వారెను. ప్రథమమున నద్భుతరీతి రామచంద్రుని గృహమున సేవకునిగ జేరి, అట నద్భుతముగ శ్రీ రామకృష్ణ దేవుని సాంగత్యము గలిగి, శ్రీ రామకృష్ణుని అనుగ్రహవీక్షణా ప్రసా దములచే నద్భుతముగ నాధ్యాత్మిక పథానువర్తియై పరిఢవిల్లి,

పారమార్థికానందమున మునింగి, లోకమున కొక అద్భుతా దర్శమును రూపించిన మన లాటుకు వివేకానందు డొసంగిన యద్భుత అద్భుతానంద నామ మెంతయు నద్భుతమును సార్థకమును అనుట కెట్టి సంశయమును లేదు. యథార్థమున నతని జీవిత మత్యద్భుతమే! అందుచేతనే 'మా గురుదేవుడైన శ్రీరామకృష్ణుని యద్భుత పారమార్థిక శక్తుల గ్రహింపదలచినచో మమ్ముగాక అద్భుతానందులను జూడుడు' అని వివేకానందుడు అద్భుతానందునిగూర్చి సగర్వముగ వచించియుండెను. ఇట్టి యద్భుతానందుడు శ్రీ శారదాదేవితో దీర్ఘయాత్రల సేవించియు, అమాయక నిర్మల ప్రేమచే సర్వుల కానందమును జేకూర్చియు, క్రమబద్ధముగ సాధనల సలుపుచు, సంగదూరుడై, సంఘవిదూరుడై, అనికేతనుడై 'సర్వము గురుదేవుడే' యను దృఢ విశ్వాసమున నుండువాడు. సోదర నాయకుడగు వివేకానందుని అధికముగ ప్రేమించు మన స్వామి 'విద్య లేకున్నను శ్రీ రామకృష్ణ దేవుని స్పర్శామాత్రమున నుత్తమ జ్ఞానము నాస్వాదించెను' అని శ్రీ వివేకానందునిచే గౌరవింపబడెడివాడు. మరియు ప్రాపంచిక ధనమున పేదయయ్యును మన యద్భుతానందుడు ఆధ్యాత్మిక జ్ఞానమున ధనికుడై, తత్ఫలితముగ గొప్ప మేధావంతులు తత్త్వవేత్తలు తన పాదముల చెంత నున్నను నిరహంకారియై, పూరీ, కాశీ, అలహాబాద్, బృందావనాది పుణ్యస్థలముల నేకాంతముగ నుండుచు, దపో నిరతుడగుచు, సర్వాఘ నివారణమగు వారణాశీ పవిత్ర క్షేత్రమున 1920 ఏప్రిల్‌లో యీ ప్రపంచరంగమునుండి నిష్క్రమించిన నిర్మల నిర్లిప్త ధ్యానయోగి, శ్రీ రామకృష్ణ

దేవుని అపూర్వ శిష్యరత్నము. 'శాస్త్రతో గురుతశ్చైవ స్వత శ్చైవ త్రి సిద్ధయః' శాస్త్ర, గురు, స్వతస్సిద్ధములుగ సిద్ధి త్రివిధముగ శాస్త్రము బోధించినది. అందు శాస్త్ర స్వతస్సిద్ధ ముల దీసినచో శేషించునది గురుసిద్ధియే గదా! అట్టి గుర్వను గ్రహ సిద్ధి బొందినవాడీ యద్భుతానంద యోగివరేణ్యుడు.

## శ్రీ తురీయానంద స్వామి

నియమ నిష్ఠాచారపరులగు బ్రాహ్మణ కుటుంబమున 1863 జనవరి మాసమున జనించిన హరినాథ చటోపాధ్యాయ చిన్నతనముననే దల్లిదండ్రుల గోల్పోయెను. బాల్యమాదిగ ద్రికాల స్నానము, గీతా పారాయణము, స్వయంపాకము మున్నగు నియమముల సక్రమలీల బాటించుచు, గీత, ఉపని షత్తులను, శ్రీశంకరాచార్యుల గ్రంథావళి దీక్షముగ బఠించువా డీ బాలుడు. 13, 14 వత్సరప్రాయమున నితడు ఒక బంధు గృహమున కేతెంచిన శ్రీరామకృష్ణ పరమహంస దేవుని వీక్షించి, 'ఏమి! ఈతడు శుకతుల్యుడుగ నుండెనే! శాస్త్రముల ద్యాగియగు శుకదేవునిగూర్చి బఠించితిని, కాని నేడు గాంచితిని' అని ఆశ్చర్యమును బొందెను. తదుపరి 2, 3 వత్సరము లట్లే దొర్లినవి. అనంతర మాతడు శ్రీరామకృష్ణుని దర్శించి, కలవు దినముల ప్రత్యేకముగ రామకృష్ణునిజేరి, అనేక అమూల్య సాధన విషయముల, తత్త్వవిషయముల శ్రవణము జేయు చుండెను. ఆతని తీవ్రవేదాంత శాస్త్ర పఠనమును దిలకించి, సర్వవేదాంతానుభవముల గ్రోలిన శ్రీరామకృష్ణదేవు డొక

పర్యాయము, సాధనల మునిగి అనుభవముగాంచుట కాతని బుద్ధిని బరిణమింపజేయుటకో యనునట్లు 'హరీ! వేదాంత శాస్త్రాధ్యయనము గావించుచుంటివి గదా! ఆనందము. 'బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య' యనియే గదా తత్త్వ శాస్త్రము బోధించును! అట్లయిన నీవు అనిత్యమగు నీ ప్రపంచ త్యాగ మొనరించి నిత్యశుద్ధ బుద్ధ ముక్త బ్రహ్మము నేల పొంద యత్నింపవు?' అని చిరునగవు మోమున దీపింప నాతని హెచ్చరించెను. నాటనుండి హరిప్రసన్నుడు తీవ్ర ఆవేదనా సంభరితుడై శ్రీరామకృష్ణ ఉపదేశానుసారముగ సాధనావిధుల మున్గి, బ్రహ్మానందమును పొంది తర్వాత శ్రీ తురీయానంద స్వామియై తనరెను.

అంత బాదచారియై తీర్థయాత్రలజేయుచు, అందందు దపస్సు గావించుచున్న మన స్వామి దృష్టి మరల సోదర శిష్యులపై బ్రసరింప గలకత్తకుజేరి, మఠమున బ్రసంగముల సలుపుచు, గీతాది గ్రంథముల బోధించుచు, ధ్యానాదుల మునుంగుచుండెను. అట్టిసమయమున వివేకానందుడు పాశ్చాత్య ఖండమున వేదాంత ప్రచారము సాగించుచు, అటకు రా తురియానందు నాహ్వానించెను. కాని భగవద్దర్శనమే తన జీవిత గమ్యమునుగా నిశ్చయించుకొనిన తురీయానందు డందులకు సమ్మతింపక నిరాకరించెను. పిదప వివేకానందుడు గలకత్తకు దిరిగివచ్చెను. ప్రేమపూరిత హృదయుడైన వివేకానందుడు సర్వవిషయముల నాతని కెరుకపరచి, ఆతని గాఢముగ గౌగి లించి 'హరిభాయి! మృత్యువాసన్నమగువరకు నా జీవిత సర్వస్వమును గురుదేవుని సందేశవ్యాప్తికై అర్పించుట నీవు

గాంచుటలేదా ? ఈ భారమున నిసుమంత భాగమునైన నీవు వహింపక సాక్షివలె జూచుచుందువా' యని స్వామి నుద్దేశించుచు, హృదయము కరిగి ప్రవహించినట్లు వచింప, నా ప్రేమకు దాసుడైన తురీయానందుడు 1899 ఆగస్టులో నమెరికాకు వెడలి విస్తృతముగా వేదాంత ప్రచారమొనర్చెను. 'నేను బోధించువాడనుమాత్రమే. కాని ఆచరించి చూపగల నా సోదరుని త్వరలో మీరు గాంచగలరు' అని అమెరికా నగరమున వివేకానందునిచే బేర్కొనబడిన సోదరుడే మనతురీయానందుడు. 1902 లో దిరిగి గలకత్తకు జేరియు మన స్వామి ఉత్తరభాగమున దపస్సు జేసికొనుచు, అనవరత జగన్మాతృ స్మరణానురక్తుడై, అంతర్ముఖుడై మనుచు, కాశీయందుగల శ్రీ రామకృష్ణ సేవాశ్రమమున గురుధ్యానపరుడై 1922 జులై లో బరమపదించెను.

## శ్రీ సుబోధానంద స్వామి

తత్త్వజ్ఞానాసక్తియు, భక్తి శ్రద్ధలును గల దంపతుల గర్భవాసమున శంకరఘోష్ వంశోద్ధారకుడుగ సుబోధ్ చంద్ర ఘోష్ 1867న గలకత్తయందు ఉద్భవించెను. బాల్యమునుండి జనని ద్వారా రామాయణ మహాభారత గాథలను, ఇతర శాస్త్ర విషయములను శ్రవణము జేయుటచే గాఢ భగవద్భక్తియు, సత్యార్థమగు ప్రేమయు నీ బాలుని లేత హృదయమున నాటుకొనెను. గృహస్థజీవన మభిలషింపక త్యాగజీవితమునే గాంక్షించు నీ బాలకుడు, ఒక దినమున దండ్రి బఱించు

చున్న The Teachings of Sri Ramakrishna 'శ్రీ రామకృష్ణ ఉపదేశము'లను బెంగాలీ గ్రంథమును జూచుట దటస్థించెను. దాని జదివిన నాటనుండి సుబోధ చంద్రుడు రామకృష్ణ దేవుని జూచు కుతూహలమున దండ్రినిగూడ రమ్మనికోరెను. కాని తండ్రి జాగుచేయుట గాంచిన సుబోధు డా యాలస్యమును భరింపజాలక నొక స్నేహితునితో దక్షిణేశ్వరమున కేగెను. శ్రీ రామకృష్ణ పరమహంసయు నా బాలుని అధిక ప్రేమ వాత్సల్యముల వీక్షించి, తన ప్రక్కపై గూర్చుండబెట్టుకొని, కొలది నిమిషములు ధ్యానమున నుండి 'నీవు ఆధ్యాత్మిక గమ్యమును జేరగలవని జగన్మాత నాకు దెలియజేసిన'దని వచించెను. కల్లకపటము లెరుగని స్వభావముగల మన సుబోధు డచిర కాలమున శ్రీ రామకృష్ణదేవుని ప్రేమానుగ్రహములకు బాత్రుడై, గురుదేవుడు బోధించు విధమున సాధనల నొనరించుచు, నాధ్యాత్మిక దివ్యతేజో స్వరూపుడును, పారమార్థిక సంపద్విభూషితుడు నగు శ్రీ రామకృష్ణ దేవుని సన్నిధి నను భూతుల నార్జింప 'పురుషకారేణ ప్రయత్నేన' అనురీతి దీవ్ర యత్నమును జేయసాగెను. అట్టి సమయమున శ్రీ రామకృష్ణు డొక దినమున 'సుబోధ్! నీవు మహేంద్రనాథ గుప్తను జూచి యుంటివా? నీ తీరిక సమయముల నాతని వద్దకు వెడలు చుండుము' అని బలుక, వెంటనే నిష్కపటియు, గృహస్థజీవితము నేవగించువాడును అగు సుబోధుడు గంభీరముగ 'తన సంసార బంధమును ఛేదింపలేని అతనినుండి నే నేమి గ్రహింతును?' అని సమాధాన మొసంగెను. గురుదేవు డా సమాధానమును ఆల కించి ఆ బాలుని త్యాగజీవిత అభిలాషకు నధికానందమున

నుండెను. ఆ బాలుని ఉత్కృష్టాదర్శమును గాంచి ఉప్పొంగెను. యథార్థముగ శిష్యుని శ్రేయమును గోరు గురువున కదియేగదా ఆనందదాయకము !

శ్రీరామకృష్ణుని మహాసమాధి యనంతరము సర్వసంగ పరిత్యాగియై యతడు శ్రీ సుబోధానంద స్వామి యయ్యెను. అందరిలో బిన్నవయస్కుడగుటచే, వివేకానందుడు సుబోధానందుని 'ఖోకా' అనగా బాలకా అని పిలిచెడివాడు. సోదర శిష్యులును అతని 'ఖోకా మహరాజ్' అనియే బిలువసాగిరి. సన్న్యసించిన బిమ్మట ఓంకార్, గిరినార్, బొంబాయి, ద్వారక, బృందావనాది బుణ్యస్థలముల బర్యటించుచు, అచ్చటచ్చట సాధనల నొనర్చెను. అంతటితో దృప్తి వహింపక కేదార్ బదరీల రెండు పర్యాయముల దర్శించెను. దేశముల దిరిగి దిరిగి గలకత్తకు జేరిన సుబోధానందుడు మృదుహృదయుడగుట సేవాశ్రమ కార్యముల నిర్వహించుచు, ఆర్తుల రక్షించుచు, సర్వవేళల బాలకునివగిది సంతోషాంత రంగుడై, ఎల్లర నానందవార్నిధి ముంచుచు నిష్కామకర్మయోగిగా రాజిల్లెను. కాంక్షాదూరుడై, మానావమానముల సరకుగొనని అనవరతే భగవన్నామానురక్తుడగు మన సుబోధానంద స్వామి 1932 డిశంబరులో నీ యనిత్య శరీరమును వీడి బ్రహ్మములో నైక్యము నొందెను.

# శ్రీ శివానంద స్వామి

దాన ధర్మ శీలుడును, గౌరవకుటుంబీకుడును, శ్రీ రామ కృష్ణ పరమహంసదేవునికి బరిచయుడునైన రామకనాయి ఘోషాలునికి కుమారునిగా 1850-60 మధ్యలో గలకత్తా యందు తారకనాధ్ ఘోషాల్ జననమొందెను. పసితనమాదిగ విద్యాసక్తియు, ధ్యానాభిలాషయు గల యీతడు కాలాంతర మున బ్రహ్మసమాజమున బ్రవేశించెను. తాను వాంఛించిన సమాధి నెంత కాలమునకు బొందకపోవుటచే మిగుల జింతించెను. విద్యాభ్యాసము ముగించి ఉద్యోగార్థ మతడు ఢిల్లీకి వెడలెను. అచ్చట నొక మిత్రునివలన నిత్యసమాధి సంయుత యోగిపుంగవుడగు శ్రీ రామకృష్ణదేవునిగూర్చి విని, ఆనందించి గలకత్తకు దిరిగివచ్చెను. అంత రామచంద్రదత్త గృహమున ప్రథమమున శ్రీ రామకృష్ణుని గాంచి తారక్‌నాధుడు సంతసించెను. మరియు దాను గోరు సమాధిని గూర్చియే నాటి శ్రీ రామకృష్ణ ప్రసంగమగుట నిక నాతని యానందమున కంతు లేదు. తదుపరి దక్షిణేశ్వరమేగిన మన తారకనాధుడు రామ కృష్ణుని తన స్వంత జననిగ గాంచి, సన్నిహిత సంబంధము నేర్పరచుకొనెను. 'సాకార నిరాకారములలో దేని నభిలషింతువు?' యని రామకృష్ణునిచే బ్రశ్నింపబడిన తారకుడు 'నిరాకారమునే' యని తన శుద్ధ అద్వైతజ్ఞానాకాంక్షను వెల్లడించెను. వివాహమైనను విషయదూరుడై, జ్ఞానాన్వేషియై, రామకృష్ణుని ఆదేశానుసారముగ సాధనల జేయుచుండెను తారకనాధుడు.

అట్టి సమయమున శ్రీరామకృష్ణుడు వ్యాధి గ్రస్థుడయ్యెను. తారకుడును అహర్నిశముల శ్రీరామకృష్ణుని సేవలమున్గుచుండ నాతని భార్యయు మృత్యువాతబడెను. బంధము తీరినదని దలంచుచు దారకుడు గృహమునకేగి సన్న్యాసమును గొనుటకు దండ్రి నర్థించెను. ఆ తండ్రియు మిగుల నానందించి, పూజాగృహమున గల భగవానునికి వందనముజేయ నాజ్ఞనిడి, గన్నుల నీరు నుంచుచు, గద్గద కంఠముతో బుత్రు శిరమున హస్తమునునిచి 'నాయనా! నేను బ్రపంచత్యాగమును జేయ బ్రయత్నించితిగాని అది నెరవేరలేదు. నీవైనను త్యాగివగుచున్నందులకెంతయు నాకు ఆనందము కలుగుచున్నది. నీవు తప్పక భగవదనుగ్రహమును పొందెదవుగాక!' యని ప్రేమవాత్సల్యములతో,నిండు హృదయముతో దనయు నాశీర్వదించి శ్రీరామకృష్ణ సన్నిధికి బంపెను. 'తండ్రి హరిజేసుమనియెడి తండ్రి తండ్రి'అను భాగవతవాక్యమీతనియందు మూర్తీభవించి ధన్యుడయ్యెను. అట్లు దండ్రి యనుజ్ఞను బొందిన తారకుడు గురుదేవుని కీ విషయమును దెలియజేయ రామకృష్ణ దేవుడును ఆనందించి తన శిష్యరత్నమును ఆధ్యాత్మికానుభూతుల నొందమని మనసార ఆశీర్వదించెను. రామకృష్ణ పరమహంస దేవుడు దేహమును వీడినపిమ్మట నీ తారక్‌నాథ ఘోషాల్ యతియై శ్రీ శివానంద స్వామియై చెలువొందెను. ఈ మన శివానందుడు 'ఇట్టి అపూర్వవ్యక్తి నెచ్చటను గానము' అని శ్రీ వివేకానందునిచే నభినందింపబడి'మహాపురుష'నామమున దనరొందెను.

ఈ స్వామి బరివ్రాజకుడై అనేక దేశముల బర్యటించి బొంబాయి, నాగపూర్ మున్నగు స్థలముల నాశ్రమముల

స్థాపించియు, శ్రీ రామకృష్ణ మఠమునకు శ్రీ బ్రహ్మానంద స్వామి యనంతరము అధ్యక్షపదవి నలంకరించి మఠ కార్యక్రమముల సక్రమరీతి నిర్వహించెను. ప్రేమ తొణికిసలాడ, దయ హృదయమునుండి పొంగిపొరల, శిష్యులకు శిక్షణము నొసంగుచు 'కర్మకు పునాదిగ ధ్యానాదులు గావలయును' అని నిష్కామ కర్మమార్గ ప్రబోధమును గావించుచు, సర్వుల ప్రేమతో దిలకించుచు, సర్వుల ప్రేమాదరముల జూరగొని నీ మహనీయుడు 1934 ఫిబ్రవరి మాసమున రామకృష్ణ గురు సాన్నిధ్యమును జేరుకొనెను.

## శ్రీ అఖండానంద స్వామి

పూర్వాచారముల బాటించు బ్రాహ్మణ వంశమున గంగాధర ఘటక్ జనించెను. బాల్యమునుండియు గంగాధరుడు స్నాన, అధ్యయనాదికముల నియమముతోడ జేయుచు నాధ్యాత్మిక జిజ్ఞాసాపరుడై యుండెను. ఆ జ్ఞానాసక్తిచేత 1884 లో హరినాధునితోగూడ దక్షిణేశ్వర మరుదెంచెను. తరచు శ్రీ రామకృష్ణునితో సంబంధము గలుగుటచే నీ బాలునికి క్రమముగా బాహ్యాచార నియమముల బాటించు ధోరణి తగ్గి అంతర్దృష్టి యభివృద్ధి నొందసాగెను. మరియు రామకృష్ణ దేవుడు నరేంద్రనాధుని గుణగణముల వివరించి గంగాధరుని నరేంద్రుని జూచిరమ్మని పంపెను. నరేంద్రుని గలిసిన గంగాధరుడు, నరేంద్రుని ధీకుశలతకు, ధైర్యాది గుణములకు, ప్రేమ హృదయమునకు మిక్కిలి ఆనందించి, అనేక విషయముల

నాతనినుండి గ్రహించెడివాడు. శ్రీ రామకృష్ణ వాక్యముల సారమును గ్రహించి, సాధనాపాటవము నార్జించి, గురు నిర్యాణానంతరము తన జీవితమును త్యాగమయము గావించిన గంగాధరుడు శ్రీ అఖండానంద స్వామియై యొప్పెను.

అఖండానందుడు యాత్రలు సల్పుచు, తీవ్ర తపోనియతి నుండుచు, కేదార్ బదరీనాధ్‌లగూడ దర్శించెను. ఇతనికి ఆంగ్ల పరిజ్ఞానముకంటె సంస్కృతజ్ఞానము అధికమై యొప్పుటచే క్షేత్రీ నగరమునగల సంస్కృత కళాశాలను వేదపాఠశాలగ మార్పు జేయించెను. అవును, మన ప్రాచీన భారతీయాధ్యాత్మిక ఔన్నత్యమును బహువిధముల వ్యక్తముజేయునవి మన వేద చతుష్టయమే గదా ! ఆ వేదములేగదా మన సంస్కృతికి ప్రాతిపదిక ! అవియే గదా జీవగర్ర. వాని గ్రహించియే మన అఖండానంద స్వామి వేద పఠనమునకు ప్రాధాన్యత నొసంగి యుండనోపు ! ఇతడు వంగభాషలో మంచి రచయితగను, వక్తగను పేరు ప్రఖ్యాతుల గడించెను. 1925 వ సంవత్సరమున మఠమున కుపాధ్యక్షుడై, అంత 1934న అధ్యక్షుడై యుండెను. హాస్యప్రియుడును, నందరికంటె జిన్నయగు అఖండానందుడు వివేకానందునికి ప్రేమపాత్రుడు. ఎల్లర కానందము నిడుచు నిర్మలహృదయుడైన మన అఖండానందుడు 1937 ఫిబ్రవరి నెలలో నఖండ పరబ్రహ్మైక్యము నొందెను.

## శ్రీ నిర్మలానంద స్వామి

బలరామబోసు గృహమున కాక పరమహంస ఏతెంచెనను విషయము, కలకత్తాలోని బోస్పారాలో నివసించుచు

స్నేహిత బృందముతో ప్రసంగించుచుండిన తులసీ చరణ దత్తు నకు దెలిసెను. నాటికి యీతని వయస్సు పదునెన్మిది వత్సర ములు. ఈ పరమహంస ఎట్లుండునో యను భావమాతనికి దోచుటతోడనే బలరామబోసు యింటికి జని రామకృష్ణ పరమ హంసను దర్శించెను. అదియే సద్గురుని ప్రథమ సందర్శనము. మరల రెండవ పర్యాయము హరినాథ, గంగాధరులతో గలిసి దక్షిణేశ్వరమునకేగెను. కాని నాడు గురుదేవుడు కలకత్తకు వెడలియుండెను. అంత మూడవ పర్యాయము ఆ సాధుసత్తముని జూడనేగెను. ఆ గురువరేణ్యుడును ప్రేమతో నా బాలుని జేరదీసి 'సాధకునకును భగవంతునకును సమావేశమును సమ కూర్చు వ్యక్తియే మధ్యవర్తి. ఆతడే గురువు' అని వచింప, నందలి యంతరార్థమును గ్రహించిన తులసియు శ్రీ రామ కృష్ణునే గురువుగ త్రికరణశుద్ధిగా విశ్వసించెను. మరియు నా యతివరేణ్యుడు సాధనల గావించిన ప్రదేశముల నధిక శ్రద్ధా సక్తులతో గాంచెను. తర్వాత తులసీ చరణుడు మహాపురుషు సన్నిధిని దిరుగాడుచు, సాధనలజేయుచు, నాత్మానందమునకై శుశ్రూషల నలుపుచుండెను. రామకృష్ణ మహాసమాధి యనంత రము శ్రీ నిర్మలానంద స్వామి నామధారియై తులసీ చరణుడు చెలువొందెను. బెంగుళూరు, మైసూరు, కొచ్చిన్, తిరువా న్కూర్ రాష్ట్రముల నిర్మలానందస్వామి బహుళముగ ప్రచార మొనర్చి అనేక మఠముల స్థాపించెను.

# శ్రీ అభేదానంద స్వామి

సంస్కృతీపరులును, భక్తశిఖామణులు నగు రసికలాల్ చంద్ర, నయంతరాదేవి దంపతులకు 1866 న గలకత్తా పట్టణమున, కాళీవరప్రసాద సంజనితుడై కాళీప్రసాద చంద్ర నామధేయమును వహించెను. జననీ జనకులా బాలకునికి మహాపురుష జీవితముల ప్రాశస్త్యమును వివరముగ దెలుపుచు, దమ పుత్రు డట్టి పుణ్యపురుషుడుగ రూపొందవలయునని గాఢముగ దలంచుచుండిరి. ఆ బాలుడును దానుగూడ ఆ మహాపురుషుల చందము ఉత్కృష్టాదర్శముల గ్రహించి, వారి దివ్యానుభూతుల గడింపవలెనని యారాటమొందుచు, దత్సంబంధ గ్రంథముల బఠించుచు, శంకరాచార్యుని త్యాగము, విద్య, మేధాసంపత్తులాతని హృదయమును గదిలింప దానుగూడ నట్టి తత్త్వవేత్త కావలయునని భావించువాడు. శంకరుని పగిది ధీ కుశలత గావలయునని దేవభాషయగు సంస్కృతమును బాల్యము నుండియే కాళీప్రసాదు డభ్యసించుచుండెను. జీవిత సమస్యల దీవ్రముగ యోచించు నా యువకుడు నాడే ప్రాక్పశ్చిమ మేధావంతుల గ్రంథముల బరిశీలించి భావిజీవితమునకు బునాదిని నిర్మించుకొనసాగెను. ఒక పర్యాయము పండిత శశిధర తర్కచూడామణియొక్క 'భారతీయ షడ్దర్శనములు' అను ఉపన్యాసము నాలకించిన కాళీప్రసాద చంద్రుడు పతంజలి యోగి పుంగవుని యోగసూత్రముల నభినందించి, వాని బఠించి, అందలి సమాధ్యనుభూతులచే నాకర్షింపబడి, వానికై యావేదన మొందుచు, ఆ యనుభవముల బ్రసాదించు వ్యక్తికై యన్వే

షణ మొనర్చుచుండెను. అట్టి దివ్యానుభూతుల సముపార్జనము గావించిన వ్యక్తి ఒక్క రామకృష్ణ దేవుడే యని కాళీప్రసాదుడు తన స్నేహితుల మూలమున దెలిసికొని, దక్షిణేశ్వరమున కేగి ఆ విషయముల నాయోగి సత్తమునిచే గ్రహించుటకు స్థిర సంకల్పుడయ్యెను.

ఆ యాతురతచే నొకనాటి మధ్యాహ్నమున మండు టెండలో బయనమై, భోజనమునుగూడ మరచి కాళీప్రసాదుడు దక్షిణేశ్వరమునకు వెడలెను. తీవ్ర ఆధ్యాత్మిక జిజ్ఞాస అతని హృదయమును బాధించుచుండ నీ బాహ్య క్షుత్పిపాస లాతని జలింపజేయవయ్యెను. కాని యీతని బరీక్షార్థమో యనునట్లు నాడు గురుదేవుడు కలకత్తకు వెడలియుండెను. ఇక ఆతని హృదయబాధను వర్ణింప నేరితరము? రాత్రి 10 గంటలకు రామకృష్ణ దేవుడు దక్షిణేశ్వరమును జేరి యీ యువకుని బిలిచి వివరముల గ్రహించెను. కాళియు దన ఆవేదనమును లో నిముడ్చుకొనలేక వెంటనే సమాధివిషయ ప్రస్తావనము జేసి, దాని బొందుటయే దన యాశయమని దృఢముగా బలికెను. అంత గురుదేవుడును ఆతని యాధ్యాత్మిక శుభలక్షణముల గాంచి, ఆనంద కందళిత హృదయుడై, ఆతని పూర్వజన్మమున గొప్పయోగిగా గుర్తించి, ఆతని దరిజేర్చి, ఆతని వక్షమున దన దివ్యహస్తము నిడి, ఆతని నాలుకపై నేవియో యక్షరముల లిఖించి, ఆధ్యాత్మిక జీవిత సౌధమునకు నాడే శంకుస్థాపనము గావించెను. కాళియు నేదియో అపూర్వ అనుభూతిని బొంది మరుదినము గృహోన్ముఖుడయ్యెను.

పిమ్మట నాసిద్ధపురుషుని సాంగత్య మహిమచే గాలీ ప్రసాదుని గోరికలు ఫలింప సాగెను. సర్వ మత ప్రాశస్త్యము నాతడు చదివియున్నను సమన్వయవిధానమును గురుదేవుని ముఖతః గ్రహించి ఆశ్చర్య మగ్నుడయ్యెను. ఆ విధానమును ఆచరణమున నుంప గృషిసల్పుచు నతడు పరమపూజ్యుని సేవించుచుండెను. శ్రీరామకృష్ణదేవుని యనంతరము బారానగర్ మఠమున నహర్నిశముల విద్యాసాధనల బ్రొద్దుపుచ్చుచు, శ్రీ శారదా రామకృష్ణులపై నత్యమ్భుతముగ శ్లోకముల లిఖించి యుండెను. పిదప శ్రీ అభేదానంద స్వామియై రాజిల్లి, పరివ్రాజ కేచ్ఛ జనింప పాదచారియై దేశదేశముల దిరిగి, గంగోత్తరి,యమునోత్తరి కేదార్ బదరీనాథ్ లదర్శించికలకత్తకుఏతెంచెను.అభేదానందుని కలకత్తా ఆగమనమును దెలిసికొనిన వివేకానందుడు, లండన్ నగరమునుండియే ఆతని నటకు ఆహ్వానించెను. ఆ యాహ్వానము నంగీకరించిన అభేదానందుడు 1896 లో లండన్ పట్టణమును జేరుకొనెను. అభేదానందుని వ్యక్తిత్వము, విద్యా వైదుష్యము, ప్రాచ్య పాశ్చాత్య విషయ సమన్వయముల గ్రహించిన వివేకానందుడు వేదాంత ప్రచారమున అతడు నిర్వహింపవలసిన విధుల నెరుకపరచి అచట నాతని ఉపన్యాసము నేర్పాటుగావించెను. ప్రథమమున అలవాటులేమిచే గొలదిగ జంకిన మన అభేదానందుడు వివేకానందుని ప్రోత్సాహమున ధైర్యముగ నత్యమ్భుతవిధాన ప్రసంగించి, తన అపార పాండిత్య ప్రకర్షచే వేలమంది శ్రోతల ముగ్ధుల గావించెను. నాటి యా సోదరుని ఉపన్యాస మాధుర్యమును గ్రోలిన మన వివేకానందుని ఆనందమునకు మేరలేదు. ఏమి యా భాతృ

ప్రేమ ! మరియు నీ సోదరుని ద్వారమున వేదాంత ప్రచారము విరివిగ సాగుననియు నా నాయకోత్తముడగు వివేకానందుడు నాడు భావించి యుండనోపు !

పై విధమున మన అభేదానందు డట్లు ప్రచారమొనరించుచు 1897న న్యూయార్కు నగరమున ప్రవేశించెను. అటనాతడు వరుసగా మోట్ మెమోరియల్ హాలునందు తొంబది యుపన్యాసముల నొసంగెను. ఆయనయొక్క ఆకర్షణీయ వ్యక్తిత్వము, ప్రవాహమునుబోలు ఆ వక్తృత్వము, ఆ సకల మత సమన్వయము నాటి యా దేశమును బ్రహ్మానందమున ముంచినవి. అట్లు సర్వవిధముల సంఘమున పేరు ప్రతిష్ఠల బొందిన మన స్వామినిగాంచి క్రైస్తవులు గొందరు యీర్ష్యచే నాయనపై నెన్నియో దుష్ప్రచారముల సాగించుట ప్రారంభించిరి. 'క్షమా శస్త్రం కరే యస్య దుర్జనః కిం కరిష్యతి। అతృణే పతితో వహ్నిః స్వయమే వోపశామ్యతి॥' క్షమ యను శస్త్రమును గల్గినవానిని దుర్జను డేమి చేయును? తృణములేని స్థలమున బడిన యగ్ని స్వయముగా నదియే ఉపశమించును గదా యనుచందమున మన స్వామి యట్టివారి వచనముల సరకుగొనక నిలిచిన ధైర్యసాహసోపేతుడు. 1921 వ సంవత్సరమున జపాన్, చైనా, ఫిలిప్పైన్, సింగపూర్‌లలో నుపన్యాసముల నొసంగుచు భారదేశమునకు అరుదెంచెను. 1928 లో మరల పెషావర్, కాబూల్, పంజాబ్ మున్నగు పట్నముల నుపన్యాసములచే విరివిగా ప్రచారమొనర్చిన స్వామి కలకత్తకు జేరి, అట 'రామకృష్ణ వేదాంత సంఘము'ను స్థాపించి, 'విశ్వవాణి' పత్రికచే నెల్లరికి వేదాంత విషయముల నభిరుచిని గలి

గించుచు, సర్వుల దన ప్రేమచే నభేద దృష్టిజూచి, 1937 రామకృష్ణ శతవార్షిక జయంత్యుత్సవముల, బాగ్లోని 1939 సెప్టెంబరున నీ మహానుభావుడు మహాసమాధినొందెను.

## శ్రీ అద్వైతానంద స్వామి

గృహస్థుడును, ఉద్యోగియు, ప్రాయమున శ్రీ రామకృష్ణునికంటె బెద్దయునగు గోపాల్‌సుర్‌కు అకస్మాత్తుగ భార్యమరణము అధికమైన బాధను కలిగించెను. అట్టి సమయమున నాతని హృదయమునకు గలిగిన గాయమును మాన్పునుద్దేశ్యమున నాతని స్నేహితుడొకడు దక్షిణేశ్వర యోగికులావతంసుడగు రామకృష్ణ దేవుని సన్నిధి కేగుమని అతనికి సలహానొసంగెను. ప్రథమమున పరమహంసను దర్శించెనుగాని ఆతనికి శాంతి లభ్యముగాదయ్యెను. మరల ద్వితీయ పర్యాయము గురుదేవుని సందర్శించి, ఆయన త్యాగవచనములచే ప్రబోధితుడై, ఉత్తేజమునొంది తన బుద్ధిని భగవదన్వేషణదెసకు ద్రిప్పి, ఆమహాపురుషుని యుపదేశముల నక్షరశః పాటించుచుండెను. రామకృష్ణుని వ్యాధి సమయమున నధికతర సేవల గావించి ధన్యుడయ్యె మన గోపాల్‌సుర్. అందరికంటె బెద్దయగుటచే నతనిని అందరును పెద్ద గోపాల్ అని పిలిచెడివారు.

అనంతరము బారానగర్ మఠమున ప్రథమమున నతడే ఆశ్రమవాసి యయ్యెను. యత్యాశ్రమము స్వీకరించి, శ్రీ అద్వైతానంద స్వామి నామధారియై, దేశముల బర్యటింపసాగెను.

క్షేత్రరాజమగు కాశీక్షేత్రమున మన స్వామి అయిదు వత్సరములు వసించి, మధూకరిచే జీవించుచు, తీవ్ర సాధనల సాగించుచు నిశ్చలత్వమును సాధించెను. అవును, 'నిశ్చలం మోక్ష ఉచ్యతే' నిశ్చలత్వమే మోక్షమని గదా శాస్త్ర తాత్పర్యము! పిమ్మట గలకత్తకు చేరి, పరమహంస దేవుని శిష్యులలో సందరికంటె ప్రాయమున నధికుడై యుండిన అద్వైతానందుడు మఠమున నితర యువక సన్న్యాస సోదరులచే క్రమ బద్ధముగ నన్నియు జేయించుచు, బరిశుభ్రతకు ప్రాధాన్య మొసంగుచు, మరణ పర్యంతము క్రమబద్ధముగ సాధనాదుల జేయుచుండెను. గురువాక్యముల నాచరించుటయం దాతని కాతడే సాటియై, గుర్వనుగ్రహముచే సర్వమును భగవన్మయముగా దర్శించిన నీ పుణ్యాత్ముడు 81 వత్సరములు జీవించి, 1904 డిశంబరు మాసమున సాక్షాత్పరబ్రహ్మరూపుడగు శ్రీ రామకృష్ణ సాన్నిధ్యమును బొందెను.

## శ్రీ విజ్ఞానానంద స్వామి

బల్‌ఘూరియాలో గౌరవనీయ కుటుంబమున 1868 వ సంవత్సరమున హరిప్రసన్న చటోపాధ్యాయ జనన మొందెను. 1883 లో హరిప్రసన్నుడు తన సహాధ్యాయుడగు శరచ్చంద్ర చక్రవర్తితో గలిసి శ్రీ రామకృష్ణదేవుని సందర్శనాభాగ్యమును బొంది, ఆ యోగిపుంగవునికి నాడే తన హృదయము నర్పించి, తన హృదయపీఠమున రామకృష్ణ ఋషి తిలకుని ఆరాధ్య దైవముగ నధిష్ఠింపజేసెను. తరచు దక్షిణేశ్వర మరుదెంచుచు,

గురుసాన్నిధ్యమున నానందించుచు, నా వాక్యసుధ నాప్యాయ ముగ గ్రోలుచుండెడివాడు. హరిప్రసన్ను డీ విధముగనున్నను యాతని కుటుంబమంతయు నా గురుదేవుని ఉన్మత్తునిగ భావించు చుండెడివారు. నిజమే, ప్రాపంచిక విషయాసక్తుల మనములు జంచలములగుట భగవదనుభవప్రపూర్ణులును, అజ్ఞమానవోద్ధ రణ కార్య నిర్వాహకులును, శాంతి ప్రదాతలునగు మహా త్ములు వారికి బిచ్చివారివలె గోచరింతురు. మరియు వీరు ఆ సాధుపురుషుల బరిహాసించుటయు సహజమే! దానిచే నా మహా పురుషుల యానందానుభూతికి నెట్టి బాధయు గలుగదుగదా! కుటుంబమంతయు నాతీరుననున్నను హరిప్రసన్నుడుమాత్రము రామకృష్ణుని విడువనేరక, గురుదేవుని స్పర్శచే దివ్యానుభూతుల ముర్గుచు 'నీవు నావాడివిగా మా జగన్మాత వచించినది. కాన నే నిన్ను ప్రేమించుచుంటి' నని గురుదేవుని ముఖతః అభయ త్వము నొంది ఆ నిర్మల ప్రేమకు వశ్యుడై యుండెను.

అంత నతడు గలకత్తాలో చదువు ముగించి, పాట్నా జేరి అట పట్టభద్రుడయ్యెను. పిదప పూనాలో సివిల్ ఇంజనీయ రింగ్ చదువుచున్న సమయమున రామకృష్ణదేవునకు వ్యాధి యంకురించుటయు, నీ శరీరమును బాయుటయు జరిగెను. కాని యీ విషయ మాతనికి దెలియలేదు. అలహాబాదున జిల్లా ఇంజనీయరుగా ఉద్యోగమున నున్న హరిప్రసన్నునకు గురు నిర్యాణవార్త గొంతకాలమునకు జేరెను. ఆ వార్త హృదయ మునకు బాధను గలిగింప నెంతయు జింతించిన హరిప్రసన్నుని మరల రామకృష్ణదేవుని త్యాగ వాక్యములు గదలింప, వ్యాకుల

చిత్తుడై, ఉన్నతోద్యోగమును త్యజించి కలకత్తకు ఏతెంచెను. గృహమునకేగిన హరిప్రసన్నుడు తన యావేదనమును దల్లి కెరింగించి, ఆమె యనుజ్ఞబడసి, మఠప్రవేశమొనర్చి శ్రీ విజ్ఞానానంద స్వామియై యొప్పెను. పరివ్రాజకుడై జరించుచు, ఉద్గ్రంథముల రచించుచు మఠమున కుపాధ్యక్షుడై, యంత అధ్యక్షస్థానమును గూడ అలంకరించి, అన్ని మఠముల బర్యావేక్షించుచు, ఉపన్యాస ప్రసంగములచేయక 'మానవ జీవిత గమ్యము దైవానుభూతి. అది ఒక్కటిమాత్రమే యథార్థమగు దృష్టినొసంగు' నని గాఢముగ విశ్వసించువాడు మన విజ్ఞానానంద స్వామి. ఆ జీవితమునకు దన సర్వస్వమును ధారవోసి, 1938 జనవరిలో బేలూరు శ్రీరామకృష్ణ దేవాలయమును సుందరముగ నిర్మించి, సర్వవిధముల సంఘ శ్రేయస్కామియైన మన స్వామి 1939 ఏప్రిలు మాసమున భగవత్సాయుజ్యము నొందెను.

పై విధమున శ్రీ రామకృష్ణ దేవుని సన్నిధిని, ప్రాపంచిక విషయములు దరిజేరని నిర్మల నిష్కల్మష త్యాగహృదయులగు యువకబృందము జేరి, ఆ జగద్గురు అనుగ్రహ వీక్షణా ప్రసారములచే దమ తమ నిజస్థితిని గ్రహించి, విషయముల సమూలముగ ద్రుంచి, యతి సార్వభౌములై త్యాగధనులై వెలుగొందిరి. వారి వారి గుణ గణముల నాకళించిన మన రామకృష్ణ పరమహంస దేవుడును వారి సంస్కారాను గుణ్యముగ నుపదేశించుచు, సాధనల జేయించుచు, వారి యఘ పుంజముల నశింపజేసి, సంకల్పమాత్రముననను, దృష్టి ప్రసారము చేతను, వాక్ప్రభావముచేతను, స్పర్శా మాహాత్మ్యమువలనను

వారి మన శ్శరీరముల బ్రహ్మాత మొనరించి, బ్రహ్మానంద సుధా స్వాదనము జేయు శక్తినొసంగి, వారిని దన యపూర్వ అగాధ అధ్యాత్మిక ప్రేమపాశముచే బంధించి, ఆ ప్రేమను వారి హృదయముల జొప్పించి, ఆ ప్రేమచేత వారు భావికాలమున సకల ముముక్షుకోటి నుద్ధరించు అవకాశమును గల్పించి, ఆ ప్రేమ వారి మరణ పర్యంతము వీడకుండునట్లు దృఢసంకల్ప మొనర్చెను. ప్రజానీకము పాశ్చాత్య వ్యామోహాఘాతములచే స్వీయ సంస్కృతిని గోల్పోవనున్న తరుణమున బ్రస్తుత భౌతికవిజ్ఞాన మేఘసముదాయమును బార్రదోలు శీతల అభౌతిక పారమార్థిక ప్రాచీన సంప్రదాయమారుతములబోలు వారును, నా సంకుచిత భయంకర అజ్ఞానాంధమును నశింపజేయ చండప్రచండకిరణముల దనరు భాస్కరుని రీతి విశాల విజ్ఞాన తేజోపుంజముల బ్రసరింప జేయువారు నగు బదునార్గురు వజ్రతుల్య శిష్యుల మన ప్రాచీన భారతీయ విజ్ఞానవైభవమును సమస్త ప్రపంచమునకు ఎలుగెత్తి చాట దయానొనర్చెను. కాన 'యః ప్రేరయామాస విఘాత పాపాన్ సింహోపమేయాన్ దశదిక్షు శిష్యాన్' పాపదూరులు సింహసమానులగు శిష్యుల నెవడు దశదిక్కులకు బ్రేరేపించెనో యని శరచ్చంద్ర దేవశర్మన్ శ్రీ రామకృష్ణ దేవుని గీర్తించి యున్నాడు. సకల మతముల గ్రహించి, యంగీకరించి, వాని ననుష్ఠించి సర్వానుభవసంపదల మునింగిన శ్రీ రామకృష్ణ గురు వరేణ్యుని శిష్యులగు వీరును ఒక్కొక్కరు ఒక్కొక్క మార్గము ననుసరించినవారై, సర్వానుభవమూర్తియొక్క సమన్వయత్వ మును హృదయమున బదిలపరచి సర్వసమైక్యతను సాధించి ధన్యులై చెలువొందిరి.

## శ్రీ శారద - శ్రీ వివేకానందుడు

వీరందరికి మిన్నగా శ్రీ రామకృష్ణ సాంగత్యమహిమచే ఆ యనుభవజాలముల గ్రహించి, సాధించి, ఆనందించి, ఆచరణ రూపమున ప్రపంచమునకు జూపిన సాధ్వీమతల్లి, ప్రముఖ శిష్యురాలు శ్రీ శారదామణిదేవి. ఆమెవలెనే శ్రీ రామకృష్ణ సన్నిధి వసించి, సాధనల గావించి, గుర్వనుగ్రహపాత్రుడై, శ్రీ పరమహంస ఉపదేశ సారముల గ్రోలి, వాని ప్రపంచమునకు బోధరూపమున సందించిన పురుషపుంగవుడు ప్రథమ శిష్యుడు శ్రీ వివేకానంద స్వామి. ఒక గురువునే యాశ్రయించి, ఒకరి శిక్షణముననే మెలంగినను వీరిరువురిలో నపూర్వ, సునూక్ష్మ వ్యత్యాసము పొడగట్టును. అనుభవమంతయు హృదయాశ్రితము. ఆ హృదయ ప్రాధాన్యతగల వ్యక్తి స్త్రీ. కాన అట్టి విశాల హృదయ సంపన్నతచే సద్గురువరేణ్యుని హృదయగత సర్వాధ్యాత్మి కానుభూతుల నాస్వాదించిన ఉత్తమ స్త్రీ మూర్తి మన శారదామాయి. మరియు పారమార్థిక విద్య బుద్ధి నాశ్రయించి యుండును. ఆ బుద్ధి పురుషాశ్రితము. కాన అట్టి ధీ కుశలతచే నవతారమూర్తియొక్క మనోగత సర్వాధ్యాత్మిక విజ్ఞానమును గ్రహించిన ఉత్తమ పురుషుడు మన వివేకానందుడు. గృహస్థ జీవితమున నున్నటుల దోచుచు, గృహస్థులకు సన్న్యాసులకు నాదర్శమై యలరారినది తపస్వినీ మణియైన శారదాదేవి. బ్రహ్మచారియై తురీయాశ్రమమును గొని, సన్న్యాసాదర్శముల జూపిన యోగిపుంగవుడు వివేకానందుడు. వాసస్థానమును వీడక ఎల్లర దన ఆత్మశక్తిచే దన సన్నిధానమునకే రప్పించిన ఆత్మశక్తి సంపన్న శారదామణి.

పరివ్రాజకుడై, ఆత్మశక్తిచే నన్ని యాటంకముల నెదుర్కొని, వాని నతీతించిన అద్భుతశక్తి సంపన్నమూర్తి వివేకానందుడు. ఆచరణముననే సర్వాదర్శముల బ్రదర్శించి ప్రాగ్దేశీయుల బ్రణతుల గొనిన జగద్వంద్య పుణ్యాచరిత మన జగన్మాత శారదామాయి. సర్వుల హృదయముల జొచ్చి, వారి హృదయగత దుర్గుణముల నెరుకపరచి, సన్మార్గోపదేశముల గావించుచున్నవో యనునట్లుండు వేదాంతోపన్యాస పరంపరచే బశ్చిమదేశవాసుల దలలొంచి, వందనముల గైకొని నీరాజనముల నొందిన జగద్విఖ్యాతుడు, సుశ్లోకుడు మన జగద్భ్రాత వివేకానంద స్వామి. వేయేల ఒక్కమాటలో రామకృష్ణ దేవుని హృదయభాగము శారదగను, మనోభాగము వివేకానందునిగను నిర్వచించిన చాలును. కాన శారదాదేవి జీవిత విధానమును గ్రహించి, ఆమె యుత్కృష్టత దెలిసికొని, ఆమె హృదయగత యనుభూతుల అగాధత్వమును విచారించి, అంత వాని సంచరించి ఆనందించుటయును, అట్లే వివేకానంద జీవితవిశేషముల బరిశీలనమొనర్చి, ఆతని యావేదనము బొంది, అతని ధీ విశాలత నర్థము జేసికొని, సమస్త విషయముల నాతని సునిశిత జ్ఞానము నవగాహనము జేసికొని, పిమ్మట వాని మన జీవిత శకటమునకు జోడించి యానందించుట యని హృదయపూర్వకముగ గ్రహించిననాడుమాత్రమే రామకృష్ణ దేవునియొక్క సంపూర్ణ సమగ్ర స్వరూపమును యథార్థముగ గ్రహించిన ట్లగును. ఈ తత్త్వ ద్వయమును దెలియుటయే పర్యవసానము. ఈ రెంటి సమ్మేళన స్వరూపమే రామకృష్ణ పరమహంస భగవానుడు.

# ఇతర శిష్యులు

కేవలము సన్న్యాసులే శ్రీరామకృష్ణుని ఆశ్రయించి, తరించుటగాక, ననేక గృహస్థులుగూడ నా భాగ్యమును బొందిరి. మన రామకృష్ణదేవుడు సన్న్యాసులకెంతయాదర్శమో అట్లే గృహస్థులకుగూడ నాదర్శముగనే నుండెను. సర్వాధ్యాత్మికానుభవకోటి అతనిలో నంతర్గత మగుటచే దన నాశ్రయించినవారికి వారి వారి గుణ సంస్కారముల ననుసరించి బోధించుచు, ఉపదేశించుచు, వారివారి యిష్టదైవోపాసనమునే బోధించుచుండుటచేత నతని సర్వతోముఖ వ్యక్తిత్వము, సర్వమతస్థులకు ఆదర్శమై తనరారెను. ప్రపంచమున గృహస్థుగ నున్నను భగవద్దర్శనా పేదనాపరు లందరికి మన గురువరేణ్యుడు ఆదర్శమే. ప్రపంచాతీత స్థితులగోరు తీవ్ర ముముక్షువులకుగూడ నతడు పరమాదర్శమే. కాన రామకృష్ణు డెట్లు గృహస్థుల కుపయుక్తమయ్యెనో, ఎవరు అతని ననుసరించి తరించిరో మొదలగు ముఖ్యాంశముల జూచెదముగాక !

ప్రేమనిలయమగు హృదయముగలిగి, గృహస్థాశ్రమమును గ్రహించియు నిస్సంగుడై, మన రామకృష్ణుని దర్శించి. అతని యాజ్ఞానుసారము ప్రవర్తించుచు, తీవ్రసాధనల మునిగి, 'భగవంతుని దర్శనభాగ్యము నొందని యీ శరీరమునకు ఆహార మెందులకు !' అని శరీరమును కృశింపజేసి, సర్వకాల సర్వావస్థల గురుదేవుడగు సాధుసత్తముని భక్తిమై భజించుచు, 'పద్మపత్రమివాంభసా' తామరపత్రమున గల జల కణమువలె అంటియంటక గృహమున వర్తించుచు, ప్రపంచ విషయముల

నిర్మలుడై, తన జీవితమును బరిశుద్ధ మొనర్చుకొని, ఆదర్శ గృహస్థు అని ప్రఖ్యాంతిగాంచిన దుర్గాచరణ నాగ్ శ్రీరామ కృష్ణుని గృహస్థశిష్యులలో ప్రథముడు. అతని కతడే సాటియై, ఆదర్శప్రాయుడై వివేకానందాది సన్న్యాస గణముచేగూడ గౌరవము నొందిన ఉత్తమవ్యక్తి.

అటేవిధముగ గొప్పవక్తయు, నాటకకర్తయు, నాట్య కళా కౌశలుడు అయియుండియు, దుర్వ్యసనముల కాహుతియై యుండిన గిరీశచంద్ర ఘోషుగూడ, అసాధారణలీల శ్రీరామ కృష్ణు నాశ్రయించి, తన పూర్వ విధానముల సంస్కరించు కొని, దేవీభక్తితో శ్రీపరమహంస శిష్యుడై, ఆజన్మాంతము పాదదాసుడై చెలువొందెను. మిక్కుట దుర్మార్గ ప్రవృత్తి గలవారు అయినను, ఆ యోగిపుంగవుకు వారి సమదృష్టి గాంచి, వారిలోగల దుర్జడతను సంస్కరింపజేసి, అసాధారణ పరిణామము గలుగజేసి, తరింపజేసెను. ఇది అపూర్వము అద్భు తము. ఇట్టి పాపాత్ములుగాని, దురాత్ములుగాని, పరమ పురుషుల సన్నిధానముననుండ 'యథా పర్వతమాదీప్తం నాశ్ర యంతి మృగాద్విజాః। తద్వ ద్బ్రహ్మవిదో దోషా నాశ్రయంతి కదాచన॥' ప్రజ్వలితమగు పర్వతము నెట్లు మృగాదులు చేరవో అట్లే బ్రహ్మానందవిలోలురగు నవతార పురుషులను ఎట్టి దోషములు జేరజాలవు అను మైత్రాయ ణ్యుపనిషద్వాక్యము వలె మహాపురుషుల నెవ్వియు బాధింప కుండుటయేగాక ఆశ్రితుల పాపములుగూడ బటాపంచలను.

ఇటులే మహేంద్రనాథగుప్తయు, మన రామకృష్ణ దేవుని ఆశ్రయించి, తా జీర్ణించు కొనుటకై పరమహంస దేవుని

కిని యితరులకును జరుగు సంభాషణముల నన్నింటిని వ్రాసి యుంచుకొని, తనకు దీరికసమయముల వాని నన్నింటి నవగాహన మొనరించుకొనుచు, అనుసరించుచు, గురుదేవుని అనుగ్రహ పాత్రుడయ్యెను. ఇట్లు ఇతడు లిఖించుకొని యుంచుకొనిన మధుర సంభాషణములే Gospel of Sri Ramakrishna 'శ్రీ రామకృష్ణ వచనామృతము' అనుపేర సుప్రశస్తమై అసంఖ్యాక సాధకులకు గర్వతమ్మై వెలుగొందెను. అట్టి అమూల్య ఆధ్యాత్మిక సంపదకు గారణభూతుడు యీ ధన్యాత్ముడు.

ఇదేవిధముగ, ప్రఖ్యాత బ్రహ్మసమాజమున కధినాయకుడై, ప్రాక్పశ్చిమ దేశముల దన వాఙ్మాధుర్యముచే నాకర్షించి, ఆధునిక విద్యానిమగ్నమైన యువకుల కాదర్శ వ్యక్తియై యొప్పారిన కేశవ చంద్రసేన్, ధనాఢ్యులయ్యును నిరాడంబరులై రామకృష్ణ దేవుని సేవా లాలసత్వమున గాలము గడుప నానందించిన బలరామబోసు, సురేశబాబు మొదలైన భక్తులెందరో రామకృష్ణ చరణద్వంద్వముల నాశ్రయించి, ఆదర్శ వ్యక్తులై అనుభూతి నార్జించి ధన్యతనొందిరి.

పై వచించిన విధాన పురుషులేగాక, శ్రీ రామకృష్ణ దేవుని యసాధారణ వ్యక్తిత్వమును స్త్రీగణముగూడ గ్రహించి, ఆశ్రయించి, ఆధ్యాత్మిక మార్గమున సుశిక్షితులై 'సర్వవర్ణాదికారశ్చ నారీణాం యోగ్యఏవ చ' అను గౌతమీ తంత్రిమురీతి నాధ్యాత్మిక పథమున యోగ్యత నార్జించి, సన్న్యాసమును స్వీకరించియు ధన్యాత్ములైరి. అందు గొందరి గూర్చి చూచెదము.

సుమారు ద్వాదశ వర్ష ప్రాయమున దల్లి దండ్రులు సంకల్పించిన వివాహమును వలదని ద్రోసి, అమృత మోక్ష సామ్రాజ్యము నధిష్ఠింప విరాగమే శరణ్యమని తల్లి అనుజ్ఞచే గృహమును బాసి, సంపూర్ణ విరాగినియై, సన్న్యసించి, ద్వాదశ వత్సరములు తప మాచరించి, వివిధ ప్రదేశముల గ్రుమ్మరుచు, మన రామకృష్ణుని సన్నిధిని జేరి, అతని చైతన్యావతారముగా విశ్వసించి, తదాజ్ఞానువర్తినియై శ్రీ శారదా సేవాభాగ్యమున గాలము గడిపినది గౌరీమాయి. సన్న్యాసినియై విద్యావతియై కొన్ని వేళల మన రామకృష్ణునకుగూడ ప్రమాణమై యొప్పారెను. ఆమె మన శారదామాయి పేర 'శ్రీశారదేశ్వరీ ఆశ్రమము' అను ఒక స్త్రీల మఠమును నెలకొల్పి, అందు స్త్రీలకు విద్యా కళల నేర్పుచు, నధికారులకు దురీయాశ్రమ మొసంగుచు, విద్యాజ్ఞాన విభూషితులగు ననేక సన్న్యాసినులకు గారణ భూతయై చెలరారినది.

మరియు నఘోరమణి నాబడు వనితారత్నము, బాల్యముననే భర్తను గోల్పోయి, జీవితమును భగవదన్వేషణాయత్తము గావించి, దక్షిణేశ్వరమునకు మూడు మైళ్ళ దూరమున గల కామర్హాతిలో గంగానదీతీరమున శిథిలావస్థనున్న శ్రీ రాధాగోవిందాలయమున బాలకృష్ణునివాత్సల్య భావమును నుపాసించుచు, దత్ఫలితమున బాలగోపాలు సక్షాత్కారమును పొంది సర్వావస్థల నతనితో నానందించుచు నుండెను. ఒకనాడు శ్రీరామకృష్ణు దర్శనార్థ మేతెంచి, అతడే తన యిష్టదైవమైన గోపాలునిగా గ్రహించి, తన వాత్సల్య

ప్రేమను మన గురుమూర్తిపై దిప్పి భక్తాగ్రగణ్యయై వన్నె కెక్కియుండెను. ఈ మెను గోపాలుని తల్లి యని పరమహంస దేవుడు అనెడివాడు.

ఇదేవిధముగ గోలప్‌మాయి, యోగిన్‌మాయి, లక్ష్మి మొదలగు అనేక స్త్రీ శిష్యులును, జీవిత సార్థక్యతకొరకు శ్రీరామకృష్ణు నాశ్రయించి, అనుసరించి ఆధ్యాత్మికానందాంబుధి మగ్న మానసులైరి. ఈ విధముగ జాతి మత లింగ విభేదముల నెంచక, సర్వ ముముక్షుకోటికి వందనీయుడై యుపదేశకుడై, ఆచార్యుడై, అధిష్ఠానదైవమై, మన గురుదేవుడు సర్వ సమత్వమును ప్రస్ఫుటపరచి యాదర్శమై చెలువొందెను.

మన రామకృష్ణుడు సమస్తజీవుల సమత్వదృష్టి దిలకించెనో, అట్లే అతని యుపదేశములుగూడ సర్వతోముఖములై ఎల్లర కన్వయించునవిగా యొప్పారును. వానిలో ముఖ్యముల గొన్ని దిలకించెదము.

## శ్రీ బోధామృతము

'గ్రంథముల శ్లోకముల గంఠస్థ మొనరించిన ప్రయోజనమేమి? జీవితపరమావధి ఈశ్వర సాక్షాత్కారము. ప్రథమమున దానికై యత్నింపుడు. భగవానుని బొంది పిమ్మట ప్రపంచమున నున్నను భయములేదు. కాన శాశ్వతమగు భగవంతుని ప్రథమముననను, పిదప నశ్వర ప్రపంచమును గాంచవలెను' ప్రథమమున భగదనుభూతిని బొందిన నిక నైహిక

విషయములపై నెట్లును గోర్కి జనింపదుగదా ! కాన 'భిద్యతే హృదయగ్రంధిః ఛిద్యంతే సర్వసంశయాః' అను ముండకశ్రుతి ప్రకారము సంశయము లడంగును. అట్టివారు 'వీతరాగభయ క్రోధః' అను గీతావాక్యముకీతి క్రోధాములనుండి విడివడి, 'ధీరః వర్తమానోపి లోకవత్' అనునట్లు ధీరుడయ్యును లోకమున వర్తించును. అట్టితరి 'నాయమాత్మా ప్రవచనేన లభ్యః' ఆత్మ గ్రంథపఠనముచే లభింపదు అను శ్రుతి ప్రకారమున గ్రంథము లెట్లు ముక్తి నొసంగును ? అందుచే మన రామకృష్ణుడీవిషయమును ముఖ్యముగా వచించుచు, గ్రంథములకంటె సాధనకు ప్రాధాన్యము నొసంగెను.

'ప్రపంచమున భార్యాబిడ్డలకై, ధనధాన్యాదులకై విలపింతురుగాని భగవంతుని కొరకై విలపించువారేరి ? యథార్థముగ భగవంతుని హృదయపూర్వకముగ ప్రార్థించుచో నతని సాక్షాత్కారము బడయనగును. కొందరికి ధనముకొరకు పిచ్చి, కొందరికి పిల్లలపిచ్చి. కాని భగవదున్మాదము గలిగినవారు ధన్యాతిధన్యులు' ఈ ప్రాపంచిక సంపద కొరకు దుఃఖింతురు కాని 'న సంతి పుత్రా త్రాణాయ న పితా నాపి బంధవా। అంత కేనాధిపన్నస్య న వీధిజ్ఞాతిషు త్రాణతా॥' యమాహ్వానము నాబడు మృత్యుముఖమున నుండువాని, తండ్రి, పుత్రులు, బంధువులు, జ్ఞాతులుగాని తప్పింపజాలరు అని బుద్ధభగవానుడు వచించినచందము, వీనినన్నింటి నిస్సారములుగా త్యజించి, భగవత్ప్రాప్తికై పిచ్చిపొంది 'బాలోన్మత్త పిశాచవత్' అనునట్లు వర్తింపవలెనని మన రామకృష్ణుని

యా దేశము. అన్నను, ప్రాపంచిక విషయములనుండి ఎంత విడివడినచో అంత భగవత్సన్నిధానము చేకూరునుగదా !

స్త్రీపురుషులకు సమముగా నన్వయించునట్లు 'కామ కాంచనములే సర్వానర్థహేతువులు గాన నాద్వయమును ద్యజింపు' డని రామకృష్ణుడు నొక్కి వక్కాణించును. కామ కాంచనముల గొందరు కామినీకాంచనములని వచింతురుగాని, 'కామము స్త్రీపురుషు లిరువురియందును సమముగా నుండును. అందుచే గామమును బారద్రోలి ఆధ్యాత్మికానంద విభూతి నొందుడు' అని రామకృష్ణ దేవుని అన్వయము. మానవ జీవితమున వేరుపురుగువలెనుండి ఇహాపరజీవితముల రెంటి యందును సౌఖ్యము లేకుండజేయు నీకామము నెవ్వరేని తుద ముట్టింప నవసరముగదా ! అటులే కాంచనతృష్ణగాక సాధన తృష్ణయున్నచో జన్మ సార్థకము. ఐహిక విషయముల తుష్టియు నాధ్యాత్మిక విషయముల తృష్ణయు నత్యంతావసరమనిగదా మన వివేకానందుడును వచించును. కాన నాధ్యాత్మికాభివృద్ధి గాంక్షించు వారు తప్పనిసరిగా 'కామ కాంచనము' లనుండి వైదొలగినగాని శాంతి యసంభవము. ఈ రహస్యమును మన రామకృష్ణు డుపదేశించి ఆధ్యాత్మిక జీవిత కీలకమును ముముక్షుకోటికి బ్రసాదించినవాడు.

He who was Rama and Krishna, is now Rama-Krishna in this body - but not in your Vedantic sense 'ఏ దేవుండట రాముడై తనరి శ్రీ కృష్ణుండుగా నయ్యెనో ఆ దేవుండె సు రామకృష్ణుడను నీయాకారమున్ దాల్చె' అను విధంబున శ్రీరామ శ్రీ కృష్ణుల సంయోగస్వరూపమే మన

శ్రీ రామకృష్ణుడుగా దానే వచించెనుగదా ! మరియు 'ఏకదా రోహమారూఢం లాలయంతీ సుతీసుతం। గరిమాణం శిశో ర్వోఢుం న సెహే గిరికూటవత్' యశోద యొకనాడు బాల కృష్ణుని నంకమున నిడుకొని లాలించుచుండ నాబాలు డామె మోయలేనంత బరువై పెద్ద పర్వతమువలె దోచెను అను భాగవతశాస్త్రమురీతి మన రామకృష్ణుడు బాల్యమున నిట్టి మహిమల ననేకము శ్రీ కృష్ణునివలె గనపరచెను. అదే విధ ముగ నుపనయనమునాడు తన వాగ్దానమునకు ముప్పు వాటిల్లకుండ ధనినుండి భిక్షగొని సత్యవాక్య పరిపాలనా దురం ధరుడగుటచేతను, మరియు భైరవి బ్రాహ్మణి యొక్క యిష్ట దైవమగు శ్రీ రామచంద్రునిగ సాక్షాత్కారమై యుండుట నామె మన పరమహంసదేవుని రఘురామునిగ బరిగణించి యున్నది. ఇట్లు శ్రీ రాముని లక్షణములును మన గురుదేవు నందు వ్యక్తము. శ్రీరామ శ్రీ కృష్ణులవలె నితడును అవతార పురుషునిగా నారాధింపబడుచు, పండిత పామర విచక్షణలేని ముముక్షుకోటికి తన క్రీగంటి వీక్షణాప్రసారముచే ముక్తి నొసంగెను. అందుచే మన రామకృష్ణుడు శ్రీ రామకృష్ణాద్యవ తారమూర్తుల నంతర్లీన మొనర్చుకొనిన నవతారశ్రేష్ఠుడే యని విదితము.

## మహా సమాధి

ఇంతవరకు జూచిన తెరంగున బాల్యమునుండియు సమాధులబ్బుచునుగుట చేతను, శ్రీ విశ్వేశ్వరీ దర్శనా

కాంక్షచే దన శారీరక ఆరోగ్యమును సరకుగొనక దీవ్ర సాధన గావించి, ఆలోకైకజననిని సాక్షాత్కరింపజేసికొని, అంతటితో దృప్తిగాంచక సకలదేవతామూర్తుల దర్శన భాగ్యమునకై బహువిధ సాధనల మునింగి, అనుభవముల గడించి, తనవద్ద కరుదెంచు మోక్షేచ్ఛాపరులకు మార్గదర్శకుడై వారి యభివృద్ధికై తపించుచు, దన జీవితమును లోక క్షేమమునకై యంకిత మొనర్చిన మన రామకృష్ణునకు నిసుమంతయేని విశ్రాంతిలేక, 1884 వ సంవత్సరమున గంఠము నందు నొప్పి ప్రారంభించెను. అది క్రమముగ వృద్ధిచెంది తుదకు వ్రణముగా బరిణమించెను. అట్టి సమయమున నతనికి మనోతీవ్రత హానికరమగుటచే వైద్యులు రామకృష్ణునికి సమాధులు రాకుండ జాగ్రత్తపడ శిష్యులకు హెచ్చరికజేసిరి. కాని యది సాధ్యమా? ప్రపంచవిషయముల మునింగిన చిత్తమును భగవదర్పణము గావించుట కష్టము. అటులే ఈశ్వర ప్రాప్తి నొందిన మనస్సు ఆజ్ఞాచక్రము జేరిన నది యిక ప్రబంచ మునకు దిగజాలదు. అందుచే గర్భమునుండి సమాధి సంస్థితుల లీనమైన మన రామకృష్ణుని సమాధుల నిలుపుట ఎవ్వరికి సాధ్యము? కాని నతని వ్యాధి తీవ్రమై కంఠమునుండి ఆహార పదార్థములు లోనికరుగుటయు గష్టమయ్యెను. చికిత్స కొరకై శ్రీరామకృష్ణుని శిష్యవర్గము కలకత్తకు జేర్చిరి. కాని యట గూడ గురుదేవునకు క్షణము విశ్రాంతిలేదు.

ఆ నాటికే శ్రీరామకృష్ణుని గొప్పదనము అంతట ప్రసరించుటచే, బూర్వము దూరమున నున్న గురుదేవుడు దగ్గరకు వచ్చి యుండుటచే గలకత్తావాసులు అతని దర్శన

భాగ్యము నొందుటకై అసంఖ్యాకులుగ రా ప్రారంభించిరి. అందుచే రామకృష్ణుని కలకత్తా పరిసరములగల ఖాశీపురమునకు గొంపోయి చికిత్స చేయించుచుండిరి. శిష్యవర్గమంతయు నహార్నిశములు గురువర్యు సేవయందే మునింగిరి. వ్యాధి తీవ్రమైనను, పాటింపక జగద్గురువర్యుడైన రామకృష్ణుడు అనవరతము శిష్యుల భావి జీవితమునకు బునాదులకై యనేక ఉపదేశముల జేయుచు, శిక్షణ మొసంగుచుండెను. ఆహా! నిష్కాముల నిస్వార్థుల చైదము లవియేగదా! తన జీవితనాటకమును విశ్వేశ్వరి ముగింపనున్నదని మన రామకృష్ణుడు గ్రహించి, యిక శరీరత్యాగమునకు రెండు దినములకుముందు, భావిప్రపంచోద్ధారకుడు, సర్వశక్తి సామర్థ్యములు గలవాడును, తన దివ్య సందేశజ్యోతులచే ప్రపంచమునందలి యజ్ఞానమును పోగొట్టి వెలుగు నొసంగువాడును, అగు నరేంద్రుని జేరబిలిచి, తనకు శ్రీకాళికచే నొసంగబడిన దివ్యశక్తుల నతనికి నర్పించి, వివేకానందబీజముల నరేంద్రునిలో నాటెను. అంత 1886 ఆగష్టు 17 వ తేదీన మన రామకృష్ణదేవుడు తన మూర్తిని సూక్ష్మ రూపమున విశ్వవ్యాప్త మొనరించి తరింపజేయ, నీ స్థూల దేహమును త్యజించి, అసంఖ్యాక శిష్యసముదాయమును దుఃఖ సాగరమున ముంచి మహాసమాధి నొందెను. అట్టి ప్రేమ మూర్తిని, పరమపవిత్ర రూపమును, గురుదేవుని, అవతార స్వరూపుని గోల్పోయిన, శిష్యకోటియొక్క హృదయావేదనను వర్ణింప నేరికి వశము?

గర్భస్థుడైన నాటనుండియు ననేక దివ్యవిభూతుల బ్రదర్శించి, జనించినదాది బాల్యలీలలలో దన దేవత్వమును బ్రక

టించి, శ్రీరామ శ్రీకృష్ణ అవతార లక్షణముల ననేకము వ్యక్త పరచి, ప్రాపంచిక విద్యా విముఖత్వమున బరావిద్యానిధియై రాజిల్లి, పరిణయమాడియు భార్యను తన జననిగ బూజించి, ముముక్షువులకు మానవ జీవితగమ్యము నెరుకపరుప దా నేగుదెంచిన విషయమును చిన్ననాటనుండియు గ్రహించి, 'భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా' అను గీతావచనముపోలె మాయా ప్రాబల్యమున యంత్రము వలె దిరుగుచున్న సర్వమానవానీకముపై దయదలంచి ఉత్తమ సాధనావిధానమును ప్రసాదింప సంకల్పించి, ప్రపంచమును సంపూర్ణముగ నవగాహన మొనరించుకొని, పునాదిలేని సాధనలో మునుంగు సాధకుల వీక్షించి చింతించి,అపార ప్రేమార్ద్రి హృదయమున నున్నత సౌధమునకు బునాదివలె నుత్తమోత్త మాధ్యాత్మిక సౌధరాజమునకు పవిత్రతయను బునాది అత్యవ సరమని 'ఓ మానవులారా, తాత్కాలిక ఆవేశములతో గూడు కొనిన మీసాధనా విధానముల గట్టిపెట్టుడు. పునాదిలేని గోడ ఎంతకాలముండును? ఆధ్యాత్మిక సౌధమును నిర్మించిన బునా దుల దృఢముగా నిర్మింపుడు. అదియే పవిత్రత. అది బ్రహ్మ చర్యమువలననే ప్రాప్తము. అదియు శ్రీ జగన్మాత అనుగ్రహ విశేషమున లభ్యము. బ్రహ్మచర్యము లేని సాధన, గట్టులేని పొలమునకు నీరు పెట్టుటవంటిది' అని ఎలుగెత్తి, తన పరమపావన సందేశమును ప్రపంచమునకు మన రామకృష్ణ దేవుడు ప్రకటించి, ఆధ్యాత్మిక సాధనరహస్యమును బోధించెను. అట్టి వాడగుటచే, నతడు నిరుపేదయై యున్నను ఆత్మధన సంప న్నుడు గాన ధనాఢ్యులు, ఐహికవిద్య లేకున్నను సర్వవిద్యా

మూలమగు బ్రహ్మవిద్యా సంపన్ను డగుటచే విద్వాంసులును, గాయకులు కవులు కళావేత్తలు సనాతనులు నాస్తికులు తార్కికులు సంస్కర్తలు మొదలగు వివిధ సాధకలోకము మన రామకృష్ణుని పాదసన్నిధిని జేరి వినమిత్ర శిరస్కులై చిత్త సంస్కారము బొంది తరించిరి. ఏయొక మతాభిమానియు గాకుండుటచే, సర్వమతసారము గ్రహించియుండుటచే సర్వ మతావలంబకులు ఆయన చెంతకరిగి దాసులై వారివారి మత రహస్యముల ననుభవయుక్తముగ గ్రహించిరి. సామాన్యలోకమునకు నున్మాదుడైన మన రామకృష్ణుడు అసామాన్యముగ ననేకుల ప్రపంచ విషయోన్మాదమును గుదిర్చెను. అనేకులకు ఆత్మవిశ్వాసమును ప్రేమతో జిత్తశాంతిని ఆత్మానుభూతిని బ్రసాదించెను. శ్రీ రామకృష్ణుడు బోధించినది వివిధమత సిద్ధాంతముల నైక్యతగాక హృదయముల ఏకత్వము. అందుచేత సర్వ వేళల నతని పండితులేమి పామరులేమి, సర్వమతములవారు ఆశ్రయించిరి. అది మన పరమహంస దేవుని అసమాన ఆత్మ బల విశేషము. కోటానుకోట్ల భక్తకోటి నేడు ఆతని నారాధించుచున్నారనిన ఆజగద్గురువర్యుని అవతార శ్రేష్ఠత్వమేగదా!

ఒకని యుత్కృష్టాదర్శమును గాంచ ఆశ్చర్యము, అంత నతని జీవిత విషయముల బరిశీలన, నట నతని యనుసరణము పిమ్మట తత్సిద్ధిని బడయుట ఆధ్యాత్మికలోకమున సామాన్యము. కాన నింతవరకు మన రామకృష్ణుని జీవిత విశేషముల బరిశీలించి, అచ్చరువొంది, వివరముల బరిశోధించియుంటిమి, ఇక అనుసరణము సిద్ధియు బడయుటకై, ఆత్మబలమును సువ్యక్తపరచి పూతచరిత్రుడైన అవతారవర్యుని జగద్గురుని,

శ్రీ రామకృష్ణ పరమహంసదేవుని జన్మదినమగు నేడు బద్ధకంకణ హస్తులమై అచిరకాల నిశ్చల సాధనాబలమున నానందదాయక ముక్తిఫలమును బొంగుదుముగాక !

## జీవిత విశేషములు

1836 గదాధరుని జననము 18-2-36 ఉ॥ 5 . 15 లకు

1843 ఖుదీరాముని మరణము.

1845 గదాధరుని ఉపనయనము.

1852 గదాధరుడు అన్నతో కలకత్త కేతెంచుట.

1853 శారదాదేవి జననము.

1855 దక్షిణేశ్వరీ కాళికాలయ నిర్మాణము.

1856 రామకుమారుని మరణము - గదాధరుని కాళికాలయమున అర్చకత్వము - శ్రీ కాళికా సాక్షాత్కారము.

1859 శ్రీ శారదా గదాధర వివాహము.

1861 భైరవీ బ్రాహ్మణీ ఆగమనము - తంత్రసాధన

1864 జటధారి ఆగమనము - వైష్ణవభావసాధన - తోతాపురి ద్వారా సన్న్యాస స్వీకారము.

1872 శ్రీ శారదాదేవి దక్షిణేశ్వరమునకు ప్రథమతః వచ్చుట. షోడశీ పూజ.

1879 శిష్యుల ఆగమనము.

1885 శ్రీ రామకృష్ణునికి వ్యాధి ప్రారంభము.

1886 శ్రీ రామకృష్ణునికి కాశీపురమున చికిత్స. 16-8-86 ఉ॥ 1-2 లకు, శ్రావణ కృష్ణ పాడ్యమి మహాసమాధి.



# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## ప్రచురణములు

1. శ్రీరామకృష్ణ లీలా సంకీర్తనము : (చతుర్థ ముద్రణము)

శ్రీరామకృష్ణ, శారద, వివేకానందులగూర్చి భక్తి ప్రబోధ కరముగా 132 కీర్తనలు.

$\frac{1}{16}$ డెమ్మీ. 200 పుటలు. రు. 0-62

2. శ్రీరామకృష్ణాంజలి : (తృతీయ ముద్రణము)

శ్రీరామకృష్ణ వివేకానంద తత్త్వములగూర్చి భక్తి ఉత్సాహ పూరిత పద్యములు 100. 0-12

3. శ్రీ దక్షిణేశ్వరీ స్తవము : (ద్వితీయ ముద్రణము)

భక్తితో తత్త్వవిషయముల ప్రబోధించు శతకము. 0-12

4. చిత్త ప్రబోధ : (ద్వితీయ ముద్రణము)

సాధకుల కనేక అమూల్య రహస్యముల బోధించు శతకము. 0-12

5. సాధనరహస్యము : (తృతీయ ముద్రణము)

ఆధ్యాత్మికాభివృద్ధికి మూలమైన యోగసూత్ర సాధన చతుష్టయముల చక్కని వ్యావహారిక భాషలో తెలిపిన సుప్రసిద్ధ గ్రంథరాజము.

$\frac{1}{8}$ క్రౌను. 340 పుటలు. 2-25

6. అనుభవానందము : (ద్వితీయ ముద్రణము)

అద్వైతానంద విభూతిని వ్యక్తపరచు శతకము. రు. 0-12

7. సాధనసుధ :

సాధనలో దగులు ఆటంకముల నివారింప అమూల్యమగు సలహాల నొసంగు పద్యగ్రంథము.

⅛ క్రౌను. 62 పుటలు. 0-50

8. మన శారదామాయి : (ద్వితీయ ముద్రణము)

శ్రీ త్యాగీశానంద విరచితము. జగన్మాత శ్రీ శారదామాయి జీవితోపదేశముల వివరించు ఉత్సాహపూరిత సులభగ్రంథము.

⅛ క్రౌను. 116 పుటలు. 1-00

9. మన వివేకానందుడు : (ద్వితీయ ముద్రణము)

శ్రీ త్యాగీశానంద విరచితము. వేదాంతకేసరి శ్రీ వివేకానందుని జీవితాదర్శముల ప్రబోధించు ఉత్కృష్ట గ్రంథము.

⅛ క్రౌను. 110 పుటలు. 1-0(

10. మన రామకృష్ణుడు : (ద్వితీయ ముద్రణము)

శ్రీ త్యాగీశానంద విరచితము. జగద్గురు శ్రీరామకృష్ణుని అద్భుతాదర్శ సాధనవివరముల సుగమముగావించుగ్రంథము.

⅛ క్రౌను. 125 పుటలు. 1-0(

11. సర్వ సిద్ధాంత సౌరభము : 1 వ భాగము.

దర్శనఖండము - ప్రథమ భాగము - సాంఖ్య యోగములు. శ్రీ కపిల పతంజలి మహర్షుల జీవితకాల విశేషముల సిద్ధాంతములు యిట చర్చితము.

⅛ క్రౌను. 850 పుటలు. 3-2(

12. శాంతి సామ్రాజ్యము :

శాంతినిగోరు నేటి ప్రపంచమునకు శాంతి ప్రబోధ గావించు ఉత్తమ గ్రంథము.

$\frac{1}{8}$ క్రౌను. 40 పుటలు. రు. 0-38

13. శ్రీరామకృష్ణాదర్శము :

శ్రీరామకృష్ణుని సాధన, సిద్ధుల రహస్యమును వివరించు ఉత్తేజకర విపుల గ్రంథము.

$\frac{1}{8}$ క్రౌను. 24 పుటలు. 0-12

14. శ్రీరామకృష్ణ పూజ :

శ్రీరామకృష్ణ పూజావిధానము సహస్ర అష్టోత్తర శత నామములతో నలరారు గ్రంథము.

$\frac{1}{16}$ డెమ్మీ. 71 పుటలు. 0-50

15. సర్వ సిద్ధాంత సౌరభము : 2 వ భాగము.

దర్శన ఖండము - ద్వితీయ భాగము - వైశేషిక న్యాయములు - శ్రీ కణాద గౌతమ మహర్షుల జీవితకాల సిద్ధాంతములు పండితాభిప్రాయములతో రచితము.

$\frac{1}{8}$ క్రౌను. 300 పుటలు. 3-00

16. సర్వ సిద్ధాంత సౌరభము : 3 వ భాగము.

దర్శన ఖండము - తృతీయ భాగము - మీమాంసాద్వయము - శ్రీ జైమినీ వ్యాసమహర్షుల జీవితకాల సిద్ధాంతములు ఆధునిక పండితాభిప్రాయములతో రచితము.

$\frac{1}{8}$ క్రౌను. 340 పుటలు. 3-00

17. సర్వ సిద్ధాంత సౌరభము: 4 వ భాగము.

అద్వైతఖండము - ప్రథమ భాగము - శ్రీ శంకరపూర్వా

ద్వైతము - వేదముల నుండి శ్రీశంకరులవరకు ప్రవహించు అద్వైత రసప్రవాహమును ముందుంచు విపుల గ్రంథము. అద్వైత సిద్ధాంతమునకు, ఆధునిక భౌతిక విజ్ఞానమునకు సమన్వయము జూపును.

⅛ క్రౌను. 440 పుటలు. రు. 4-25

18. మాండూక్య రసాయనము:

శ్రీ అనుభవ భాష్యము. 108 ఉపనిషత్తుల ముఖ్య మంత్రములతో, గౌడపాద కారికలతో వ్యాఖ్యాతము.

⅛ క్రౌను. 160 పుటలు. 1-25

19. సర్వ సిద్ధాంత సౌరభము : 5 వ భాగము.

అద్వైతఖండము - ద్వితీయ భాగము-శ్రీ శంకరాద్వైతము. శ్రీ శంకర జీవితకాల విశేషములు, అద్వైత సిద్ధాంతము విస్తృతముగా వివరింపబడినవి. సన్యాసప్రాశస్త్య, అధికార వివరములు గలవు.

⅛ క్రౌను. 536 పుటలు. 4-25

20. సర్వ సిద్ధాంత సౌరభము: 6 వ భాగము.

అద్వైతఖండము - తృతీయ భాగము - శ్రీ శంకరానంతరాద్వైతము-శ్రీ సురేశ్వర విద్యారణ్య వాచస్పతి నిశ్చలదాసాది కర్తల భావవివరణము విపులముగా నిందుండును.

⅛ క్రౌను. 375 పుటలు. 3-25

21. సర్వ సిద్ధాంత సౌరభము: 7 వ భాగము.

వైష్ణవ ఖండము - ప్రథమ భాగము - (అచ్చులో)

